# పరిచయం

గత ఏడేండ్లుగ చైనా స్వాతంత్ర్యపోరాటం సాగిస్తోంది. ఫాసిస్టు-సామ్రాజ్యవాదుల నెదిర్చి ప్రతిఘటిస్తోంది. చైనాలోని ఆంతరంగిక రాజకీయ పరిస్థితులు టూకీగావచ్చే గాలివార్తలవల్ల మనకు సరిగా తెలియడం లేదు. అంతా బాగానే ఉంది; చైనా స్వాతంత్ర్యపోరాటం ముందుకు సాగిపోతూందనే భావాన్ని కల్గిస్తున్నాయి. ఏవైనా ఆంతరంగిక కలతలు చైనాల్లో చూచాయగ వింటే వాటికి కారకులెవరో మనం సరిగా గ్రహించ లేకున్నాం. ఈ చిన్నపుస్తకం కొంతవరకా కొరతను దీర్చి యదార్థాన్ని తెలియజేస్తుంది.

ఇందులో చైనా జాతీయైక్యతను – కొమింటాంగ్ కమ్యూనిస్టు ఐక్యతను-గూర్చి తెలిపే నాల్గు డాక్యుమెంట్లు ప్రచురించుతున్నాం. దానితో పాటు 'యుద్ధం - కార్మికవర్గ' అనే రష్యన్ ట్రేడ్‌యూనియన్ మాస పత్రికలో వ్లాడిమర్ రోగోల్ వ్రాసిన చైనాపై వ్యాసాన్నిగూడ చేర్చుతున్నాం. ఇటీవల ఈ చరిత్రలో ఇంకెన్నో సంఘటనలు, మార్పులు వచ్చాయి. అవన్నీ ఇందులో వివరించుటలేదు.

చైనా జాతీయైక్యతా పోరాటం మన భారత స్వాతంత్ర్య పోరాటాని కొక అమూల్యపాఠం. మనకేకాదు: స్వాతంత్ర్య పోరాటంలోనున్న సర్వ దేశాల ప్రజలకు ఆదర్శచరిత్ర. చైనా జాతీయైక్యతకు విచ్ఛిన్నకులెవరో, ఆ ప్రయత్నా లెంత దేశానర్థదాయకమో మనం గుర్తించాలి. చైనా స్వాతంత్ర్యపోరాట ఫలితాలపై ఆసియాఖండంలోని ప్రజల భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. అందుచే మనకెంతో ప్రాముఖ్యం.

చైనా 1937–38 సంవత్సరాల్లో, అప్పటివరకు జరుగుతున్న మారణ అంతర్యుద్ధాలనుండి బయటపడింది. కొమిటాంగ్ - కమ్యూనిస్టు ఐక్యత సిద్ధించింది. జపాను వ్యతిరేకప్రతిఘటన తీవ్రతరమైంది. ప్రజాశక్తులు విజృంభించ నారంభించాయి. ప్రజాస్వామికమంటే భయపడే

కొందరి కుట్రలవల్ల ఐక్యత ముందుకు సాగకుండా కుంటుపడ్డది. 1941 లో కొమింటాంగ్ సైన్యాలు కమ్యూనిస్టుల కొత్త నాల్గవసైన్యంపై దాడి చేశాయి. కమ్యూనిస్టులు మిక్కిలి ఓర్పుతో ప్రవర్తించి అంతర్యుద్ధాన్ని మరల రాకుండా కాపాడారు.

చియాంగ్-కై షేక్ మొదట్లో ఐక్యతావిచ్ఛిన్నకుల నెదిర్చి నిలబడినా, క్రమంగా వారిచేతుల్లోకి జారిపోయాడు. అనేక ఐక్యతా వ్యతిరేక చర్యలకు తోడుగా ' చైనా భవిష్యత్ ' అనే గ్రంధాన్నొకటి ప్రకటించాడు. అందులో ఫేసిస్టులు ప్రబోధించే జాత్యహంభావ సిద్ధాంతాన్ని. ప్రజాతంత్ర వ్యతిరేక నిరంకుశ నియంతృత్వ సిద్ధాంతాన్ని. కరడుగట్టిన కమ్యూనిస్టు వ్యతిరేకతను క్రుమ్మరించాడు. కమ్యూనిస్టులపై అపనిందలువేసి కయ్యానికి కాలుదువ్వాడు. దేశాన్ని కమంగా మరల అంతర్యుద్ధ సామీప్యానికి తెచ్చాడు.

అయితే, ఈ ఉదంతమంతా చైనాలోని విషమపరిస్థితుల్నిగూర్చి మాత్రమే తెలుపుతోంది. మరోవైపున మహత్తర విషయాలు లేకపోలేదు. ఇన్ని చిక్కులను ఎదుర్కొంటూ గత ఏడు సంవత్సరాలుగ క్రూర జపాను శత్రువు నెదిర్చి ప్రతిఘటిస్తోంది. సరయిన జాతీయైక్యతే ఉంటే ఇంకా ఎంతో విజయవంతంగా ముందుకు పోయి చైనాప్రజల కష్టాల్నిదేర్చి ఉండేది. చైనా భూభాగాన్నుండి శత్రునిశ్శేషం చేయగల్గేది.

దేశభక్తులం, ప్రజాతంత్రవాదులం, ఫేసిస్టు వ్యతిరేకులమయిన మనమంతా చైనాలోని ఆంతరంగిక విషమపరిస్థితిని గుర్తించాలి. ఐక్యతా విచ్ఛిన్నకుల మోసపు ప్రచారానికి లోబడకుండా యధార్థాన్ని గుర్తించి ప్రజాశక్తులను బలపర్చాలి. చైనా జాతీయైక్యతను కాపాడటానికి మనం చేతనయినంత పాటుపడాలి. స్వాతంత్ర్య పోరాటంలో మునిగి ఉన్నజాతులకు ప్రజలకు ఐక్యతే విప్లవాయుధమని గ్రహించాలి. ఆ పాఠాలు మన దేశ రాజకీయాలలో అమలుపర్చాలి.

— సంపాదక వర్గం.



## చైనా స్వాతంత్ర్యయుద్ధ పంచమ వార్షికోత్సవానికి

# చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రకటించిన ప్రణాళిక.

(1942 జులై 7.)

వీరోచిత పోరాటం చేసే సైనికసోదరులారా; ప్రజలారా!

మన స్వాతంత్ర్యయుద్ధ పంచమవార్షికోత్సవ సందర్భంలో కమ్యూనిస్టు కేంద్రకమిటీ అయిన మేము, మా సోదరప్రజలు దేశదాస్యవిముక్తికై చేస్తున్న పోరాటానికి అభివందనాలు తెలియచేస్తున్నాం. యుద్ధరంగాల్లో ప్రాణాలు విడిచిన యోధుల కుటుంబాలకు మా హృదయపూర్వక సానుభూతి. గాయపడిన సైనికుల ఆరోగ్యాన్నిగూర్చి శ్రద్ధతో విచారిస్తాము.

అదే ఆశయాలతో ఫాసిస్టులకు, దురాక్రమణదారులకు, వ్యతిరేకంగా ప్రపంచమంతటా పోరాడే సోదరసైనికులకు ప్రజాస్వామ్యం పేరిట, విజయం పేరిట, మా ధన్యవాదాలు.

## ఫాసిస్టు వ్యతిరేకపక్షం జయిస్తోంది

మన స్వాతంత్ర్యపోరాటంలో ఐదు సంవత్సరాలు గడచిపోయాయి. ఆరవ సంవత్సరంలో ప్రవేశించిన ఈ సమయంలో ఫాసిస్టువ్యతిరేకపోరాట విజయం దాపులోకి వచ్చింది. ప్రజాపక్ష శక్తులలో-సోవియట్ విజయాలు, సోవియట్ యూనియన్ సంఘటితశక్తి, రెడ్ఆర్మీ సాహసం, సోవియట్ ప్రజల బ్రహ్మాండమైన ఉత్సాహం చూస్తున్నాం.

ఇంగ్లండు, అమెరికాదేశాల్లో పెద్ద ఎత్తున యుద్ధసామగ్రి ఉత్పత్తి చేస్తున్నారు ప్రజల్లో పోరాటచైతన్యం వృద్ధయింది. సైనిక, నావిక, వైమానిక శక్తుల నభివృద్ధిచేసి రెండవ రంగానికి తీవ్ర ప్రయత్నాలు సాగడం చూస్తున్నాం.

ఇవన్నీచూస్తే బ్రిటన్ అమెరికా, సోవియట్ పక్షం — హిట్లర్ని, యూరప్‌లోని అతని భాగస్వాముల్ని ఒక సంవత్సరకాలంలోనే ఓడించేశక్తి గల్గిఉందనడంలో సందేహంలేదు.

## ఫాసిస్టులు కొళ్లకు బుద్ధిచెపుతున్నారు

అటు ఫాసిస్టుపక్షం చూద్దాం. రష్యారంగంలో జర్మనీ వసంత, వేసవి దండయాత్రలు విఫలమయ్యాయి. విమానబలంలో జర్మనీ ప్రాబల్యం తగ్గిపోయింది. జర్మనుప్రజల్లో అసంతృప్తి హెచ్చుతోంది. ఆక్రమితప్రదేశాల్లో ప్రజలు తిరుగబడుతున్నారు. యుద్ధసామగ్రి ఉత్పత్తి పడిపోయింది. నిత్యజీవితావసర వస్తువులే కరువైనాయి. యుద్ధరంగంలో విపరీత సైనికనష్టం, మనుష్యశక్తి తగ్గిపోవడం మనకు స్పష్టంగా గోచరిస్తున్నాయి.

జర్మనీ - ఇటలీ ఫాసిస్టుమిత్రాకు ప్రాచ్యభాగంలో భాగస్వామిగానున్న జపాను సంగతిచూదాం. యుద్ధరంగం చాల విశాలమయింది; సైన్యాలు వివిధ రంగాలకు చీలిపోయాయి; ఆర్థికంగా దివాలా ఎత్తింది; సరఫరాలు బహుకష్టతరమై పోయాయి. అదే సమయంలో దానికివచ్చిన చావు ఏమంటే అనేకమంది శత్రువులను నెత్తికి తెచ్చుకొందేగాని ఏ ఒక్కరినీ పూర్తిగ జయించలేదు. ఇదంతా చూస్తే అక్షరాజ్యాలు రోజురోజుకు సంపూర్ణ ఓటిమికి, సర్వనాశనానికి దగ్గరపడుతున్నాయని తెలుస్తుంది.

## యుద్ధానంతర స్వాతంత్ర్యప్రపంచం

విజయ మెవరిదో కళ్ళకుకట్టినట్లు కన్పిస్తోంది. ఈ సంవత్సరం హిట్లరును; ముందునాటికి జపాన్ను ఓడించగలమనే విశ్వాసం మనకుండాలి. మనమంతా ఈ ఆశయాన్ని సాధించడానికి పోరాడాలి. మరింత సంతోషదాయక విషయమేమంటే, విజయ మెవరిదో స్పష్టం గావడంతోపాటు, యుద్ధానంతర ప్రపంచ భవిష్యత్ ఎలా ఉంటుందో ఇప్పుడే ఖచ్చితమైన స్పష్టీకరణ చేయబడ్డది.

క్రిందటి ఆగస్టులో ప్రకటించిన అట్లాంటిక్ చార్టరు, 1942జనవరిలో 26 సంయుక్త దేశాలప్రకటన, ఇటీవల జరిగిన ఆంగ్లో - రష్యన్ సంధి (1942 మే 26), సోవియట్ – అమెరికాసంధి మున్నగునవి గమనించాలి. యుద్ధానంతర ప్రపంచం, స్వేచ్ఛా, స్వాతంత్ర్య, శాంతులతో ఉంటుందని తెలియచేశాయి. ఇకముందు దురాక్రమణగాని, దేశాల అంతరంగికవ్యవహారాల్లో జోక్యంగాని ఉండవు. ఏజాతి, ప్రజల స్వాతంత్ర్యాన్ని ఎవరూ అడ్డజాలరు. ప్రతిదేశమూ, జాతీ తమకిష్టమైన ప్రభుత్వ విధానం అమలుపర్చుకోగలదు. దురాక్రమణతో గూడిన ఫాసిజమ్ మరల తలఎత్తే అవకాశంలేదు.

ఇవన్నీ సోవియట్ యూనియన్, చైనా, ఇంగ్లండు, అమెరికాలచే గుర్తింపబడ్డాయి. ఇది చైనాప్రజలకేగాక ప్రపంచ ప్రజలందరివాంఛ చైనా కమ్యూనిస్టుపార్టీ ఈ ప్రకటన లన్నిటిని బలపరుస్తోంది. ఈ ప్రకటనల్లోని మూలసూత్రాల నాధారంగా తీసుకొని, చైనాయొక్క, తదితర ప్రపంచముయొక్క యుద్ధానంతర భవిష్యత్ పునర్నిర్మాణానికి చైనా కమ్యూనిస్టుపార్టీ, అన్ని దేశభక్తపార్టీల మతాలతో సహకారంచేసి పనిచేస్తుంది.

## చైనా ముందున్న కార్యక్రమం

ఈ అంతర్జాతీయ పరిస్థితుల్లో మన స్వాతంత్ర్యపోరాటాన్ని రెండు ముఖ్య సమస్యలు ఎదుర్కొంటున్నాయి. మొదటిది, మనకున్న కాలాన్ని ఎంత బాగా ఉపయోగించుకొని యుద్ధంలో విజయం పొందాలి? రెండోది, ప్రస్తుత యుద్ధ సమస్యలపైన, యుద్ధానంతర పునర్నిర్మాణ సమస్యలపైన అన్ని పార్టీలను, మతాలను ఏకాభిప్రాయానికి దెచ్చు మార్గాలేమిటి? కాలాన్ని సద్వినియోగం చేయడం, ఐక్యతను సాధించడం అనేవి రెండే ప్రధాన సమస్యలు.

కాల సద్వినియోగ సమస్య : సోవియట్ యూనియన్, గ్రేట్ బ్రిటన్, అమెరికాలు హిట్లరును ఈ సంవత్సరమే ఓడించగల్గితే, ముందు నాటికి చైనా, బ్రిటన్, అమెరికాలు జపానుపనిపడతాయి. ఒకవేళ జపాను సోవియట్‌రష్యాపై దాడిచేస్తే, ఆరితేరిన సోవియట్ సైబీరియన్ సైన్యాలు తగిన శాస్తిచేస్తాయనడంలో సందేహంలేదు విజయం త్వరలో లభించనున్నప్పటికి అనేక కష్టనష్టాలతోకూడి దని మనకు తెలుసు.

జపాను దోపిడిగాళ్ళు, ఇంకా మనపై దాడిచేస్తున్నారు. యుద్ధరంగం శత్రు వెనుకభాగంలోనున్న మన సైన్యాల్ని తుడిచిపెట్టే దండయాత్రలు సాగిస్తున్నారు. చైనా జాతీయైక్యతను బద్దలుచేయ ప్రయత్నిస్తున్నారు. జపాను వ్యతిరేకపక్షంలో ఇంకా వేచిచూద్దామనేవారు, దైవసహాయానికి యెదురుచూసేవారు ఉన్నారు. కొమింటాంగ్ - కమ్యూనిస్టు పార్టీల సంబంధాలు సక్రమంగాలేవు. ఆర్థికచిక్కులు మిక్కిలి హెచ్చుగా వున్నాయి.

ఆరవ సంవత్సర యుద్ధం ప్రారంభమైంది. విజయం దాపులో కన్పిస్తోంది. అయినను యుద్ధారంభంనుండి ఎన్నడూ, మనమెదుర్కొనని అనేక క్లిష్టసమస్యలు నేడు మనల్నెదుర్కొంటున్నాయి. ఎప్పుడు మనం

క్షణకాలం అజాగ్రత్తగావుంటే, మన ప్రయత్నాలు సడలిస్తే, అప్పుడు మనమింతవరకు సాధించిన మహా విజయాలన్నీ గంగపాలయ్యే ప్రమాద పరిస్థితులున్నాయి. రానున్న విజయలక్ష్మిని చేబట్టుటకు మనమీ ప్రమాదాన్నుండి జాగ్రతతో కాపాడుకోవాలి. ఈ సంవత్సరం సమస్త కష్టాలను యెదుర్కొని వాటినుండి బయటపడాలి.

ఇందుకు దేశం మొత్తంగా ఐక్యతతో కృషిచేసి అమూల్యకాలాన్ని సద్వినియోగం చేసుకోవాలి. మన చైనా ప్రజలు జపాను సామ్రాజ్యవాదులతో గత ఐదు సంవత్సరాలుగ ఘోరయుద్ధం చేస్తున్నారు. అయితే మన మీ సంవత్సరం, లోగడ సాధించిన ఘనకార్యాలను మరిపించే వజ్రసంకల్పంతో పోరాడాలి. ఈ పరీక్షసమయం దాటి ఒడ్డెక్కితే విజయం మన ముందు వుంటుంది.

## యుద్ధకాలంలోనూ, శాంతి సమయంలోనూ ఐక్యత

ఐక్యత విషయంలో అన్ని జపాను వ్యతిరేక పార్టీలు, ముఠాలు యుద్ధంలోనేగాక, యుద్ధానంతరంగూడ కలసి వుంటాయని చైనా కమ్యూనిస్టుపార్టీ విశ్వసిస్తోంది.

యుద్ధానంతరం చైనా సంపూర్ణ స్వాతంత్ర్యం కలిగివుండాలి. సమానహోదాతో, పరస్పర ఉపయోగంకోసరం, అన్ని మిత్రదేశాలతోనూ సంబంధాలేర్పరచుకోవాలి. బానిసదేశంగానో, వలసదేశంగానో, కొంత భాగం వలసదేశంగానో చైనావుండటం దుస్సహవిషయం.

యుద్ధానంతర చైనాలో అటుజమిందారీ నిరంకుశ ప్రభుత్వంగాని, ఇటు సోవియట్ సోషలిస్టు ప్రభుత్వంగాని ఉండక ప్రజాస్వామ్య ప్రభుత్వము వుండాలి.

యుద్ధానంతర చైనా అనైక్యతతో ముక్కలుగ చీలి అంతర్యుద్ధాలతో మునుగరాదు. ఐక్యతతో వుండాలి.

యుద్ధానంతర చైనాలో ఏకొద్దిమంది మైనారిటీ వారి ఆర్థిక ప్రయోజనాలకో పాటుబడి, విశేష జనసామాన్యాన్ని దోపిడి దరిద్రబాధలకు గురి చేయరాదు. భూములను, ఫ్యాక్టరీలను ప్రభుత్వం బలవంతంగా స్వాధీన పర్చుకోరాదు. ప్రజలకు జీవితావసర పరికరాలు, సౌఖ్యముగల్గి ఆర్థికంగా అభివృద్ధికావాలి.

యుద్ధానంతర చైనాలో మైనారిటీవెళ్ళిన ప్రతివ్యక్తికి వోటుండాలి. అన్ని పార్టీలు, మతాలు గల్గిన సంయుక్త ప్రజా ప్రభుత్వముండాలి. అంతేగాని, ఏ కుర్చీకాయమందో ప్రజలందరి హక్కులను పొట్టబెట్టుకొని నిరంకుశాధికారాన్ని చలాయించరాదు. క్లుప్తంలో చెప్పాలంటే యుద్ధానంతర చైనా నూతన సమాజనిర్మాణం; డాక్టర్, సన్‌యట్‌సేన్ 'మూడు సూత్రాల'పైనా, కోమింటాంగ్ స్వాతంత్ర్య యుద్ధానికి, చైనా పునర్నిర్మాణానికి యిచ్చిన కార్యక్రమంపైనా, చైనా కమ్యూనిస్టుపార్టీ యిచ్చిన సాంఘిక, రాజకీయ కార్యక్రమంపైనా ఆధారపడివుండాలి.

మన స్వాతంత్ర్య యుద్ధం ప్రారంభమైననాటినుండి, చైనా కమ్యూనిస్టుపార్టీ, దేశంలోని అన్నిపార్టీల, మతాల, ప్రజల సహకారంతో యుద్ధంచేస్తామని ప్రకటిస్తోంది; నూత్నసమాజనిర్మాణంగల కొత్తచైనాను నిర్మించుటకు పూనుకుంటానని ఎలుగెత్తి చాటింది.

## కమ్యూనిస్టుపార్టీ పంథా ఏమిటి?

ఎన్నడో 1937 సెప్టెంబరు 22 వ తేదీనే కమ్యూనిస్టుపార్టీ తన పాలసీని ప్రకటించింది.

(1) నేడు చైనాకు డాక్టరు సన్‌యట్‌సేన్‌యొక్క మూడుసూత్రాలు అత్యంత ప్రాముఖ్యమైనవి. వాటిని సమగ్రంగా సాధించడానికి చైనా కమ్యూనిస్టుపార్టీ పోరాడుతుంది.

(2) కోమింటాంగ్‌ను కూలదోసే సాయుధపోరాటాన్ని, విప్లవోద్యమాన్ని ఆపివేస్తాం; భూస్వాముల భూముల్ని బలవంతంగా స్వాధీన పర్చుకోవడం మానేస్తాం.

(3) ప్రస్తుత సోవియట్ చైనాలోని సోవియట్ ప్రభుత్వాన్ని రద్దుచేసి ప్రజాస్వామ్య పద్ధతులను అమలుపరుస్తాం. అప్పుడే దేశమంతటా ఒకేరకమైన ప్రజాస్వామిక ప్రభుత్వం అమల్లోకివస్తుంది.

(4) ఎర్రసైన్యం పేరు, హోదాలు తీసివేస్తాం. మా సైన్యాలను జాతీయప్రభుత్వ మిలిటరీ కౌన్సిలు ఆధిపత్యాన జాతీయ విప్లవసైన్యంగా ఏర్పరుస్తాం. జపాను వ్యతిరేకపోరాటంలో మా విధిని నిర్వర్తించుటకు జాతీయప్రభుత్వ ఆజ్ఞలను శిరసావహిస్తాం.

గత ఐదేండ్లుగ చైనా కమ్యూనిస్టుపార్టీ తన వాగ్దానాల ప్రకారం నిలిచి ఉంది. వాటిని కార్యరూపంలోకితెచ్చి ఆచరణలోపెట్టింది. అందుకి క్రింది పనులే నిదర్శనం. కొత్త నాల్గవసైన్యం, అష్టమసైన్యం జపాను ముష్కరుల నెదిర్చి అతిసాహసంతో పోరాడింది. కొమింటాంగు, తదితర రాజకీయ పార్టీలతో చైనా కమ్యూనిస్టుపార్టీ ఆదర్శసహకారం చూపెట్టింది. ప్రస్తుత వాతావరణాన్ని, అవసరాన్నిబట్టి శత్రువు వెనుకభాగంలోని జపాను వ్యతిరేక కేంద్రాల్లో 3-3-3 రాజకీయపాలసీ అమల్లోపెట్టాం. (ఒకవంతు కొమింటాంగ్, ఒకవంతు కమ్యూనిస్టుపార్టీ, ఒకవంతు ఏ పార్టీకి చెందని దేశభక్తులు గల్గిన ప్రాజాస్వామ్యం) భూమిపాలసీ, లేబరుపాలసీ, విజ్ఞాన పాలసీ మున్నగువాటి కనుగుణ్యమైన కార్యక్రమంవేసి ఆచరణలో పెట్టాం. ఇది మా వాగ్దానాల ప్రకారం అమలుజరిపిన కార్యక్రమం.

మా వాగ్దానాల ఉద్దేశ్యమూ, పైనచెప్పిన పాలసీలు, కార్యక్రమమూ నేడు యుద్ధంలో ఉన్న చైనాకే గాక యుద్ధానంతర పునర్నిర్మాణమునకు గూడ పూర్తిగ వర్తిస్తాయి. వాటి విజయంకోసం కమ్యూనిస్టుపార్టీ పోరాడు తుందని మరోసారి ప్రతిజ్ఞచేస్తున్నాం. స్వలాభాలతో మత్తెక్కినవారు మాత్రమే చైనా కమ్యూనిస్టుపార్టీ యుద్ధకృషిని భగ్నం చేస్తూందని, యుద్ధా నంతరం సోషలిజం రుద్దుతుందని వాపోతూ పుకార్లు వ్యాపింపచేస్తారు.

## పూర్తి సంయుక్త సంఘటన

విజయం శీఘ్రంగా రానున్న ఈ సమయంలో చైనా ప్రజలంతా యుద్ధ విజయానికేగాక యుద్ధానంతర పునర్నిర్మాణానికి గూడ ఏకీకృత నిశ్చితాభిప్రాయులై ఉండాలి. ఒకరిపై నొకరు అనుమానాలు, పోట్లాటలు మానాలి. విజయసాధనకు, ఐక్యత, శాంతి, స్వాతంత్ర్యాలతో రాణించే ప్రజాస్వామ్య చైనానునిర్మించాలి. ఇందులకు అఖిలపక్ష ఐక్యత అవసరం.

యుద్ధనిర్వహణకు చియాంగ్కైషేక్ నాయకత్వాన్ని, యావన్మంది సైనికులు, పౌరులు ఏకగ్రీవంగా బలపర్చాలని చైనా కమ్యూనిస్టుపార్టీ కోరుతూంది. అధ్యక్షుడుగానున్న చియాంగ్ నేడు యుద్ధకాలంలోనేగాక, యుద్ధానంతర పునర్నిర్మాణానికి గూడ నాయకుడుగ ఉండుటకు అంగీక స్తోంది.

పై ఆశయాల్ని సాధించాలంటే కొమింటాంగ్ - కమ్యూనిస్టుపార్టీ, తదితర జపాను వ్యతిరేకముఠాల మధ్య సామరస్యం ఎక్కువ కావాలని,

జాతీయైక్యత బలపడాలని, ప్రజాపక్షంలో జపాను చీలికలుదెచ్చే అవకాశ మివ్వరాదని చైనా కమ్యూనిస్టుపార్టీ విశ్వసిస్తోంది.

కొమింటాంగ్- కమ్యూనిస్టుల మధ్య ఎలాంటి పాతతగాదాలనయినా పరిష్కరించుకోడానికి శాయశక్తుల పాటుపడుటకు సంసిద్ధులుగా ఉన్నాం. అంతేగాక, కోమింటాంగ్, తక్కిన జపానువ్యతిరేక పార్టీలతో యుద్ధంలో గెలవడానికి, యుద్ధానంతర పునర్నిర్మాణాన్ని సాగించడానికి అవసరమైన అన్నిసమస్యలు చర్చించడానికి మేము సాయపడతాం.

ప్రజల స్థైర్యాన్ని కాపాడి పైస్థాయికి గొనిపోవాలి. జపాన్ను ఓడించుటకు, యుద్ధానంతర పునర్నిర్మాణానికి పునాదులు వేయుటకు, ముందుగనే సన్యట్ సేన్ 'మూడు సూత్రాలను' 'స్వాతంత్ర్యయుద్ధానికి జాతీయ పునర్నిర్మాణానికి కార్యక్రిమా'న్ని ఆధారంచేసికొని జాతీయ పాలసీలు ముందుకు రావాలి. అప్పుడే ప్రజలందర్ని ఖచ్చితంగా యుద్ధంలో పాల్గొనేటట్టు చేయ సాధ్యమని కమ్యూనిస్టుపార్టీ తలుస్తోంది.

దేశమంతటా, పౌరుల్లోనూ, సైన్యంలోనూ మన విజయంపై సంపూర్ణ విశ్వాసం కల్గించాలని కమ్యూనిస్టుపార్టీ కోరుతూంది. అధైర్యం, 'ఇక లాభంలేదు' అనే భావాలను పోగొట్టాలి. 'ఇంకా వేచి చూద్దాం' 'దేవునిపై భారం' అంటూ చేతులు ముడుచుక కూర్చునేధోరణిని రూపు మాపాలి. శతృవుపై దాడిచేసి విజయం సాధించుటకు అవసరమైన కార్య కలాపాలలో నిమగ్నులను చెయ్యాలి యుద్ధప్రయత్నాలను కుంటుపరచే, భగ్నంచేసే అన్నిసిద్ధాంతాలను, చర్యలను అరికట్టాలి.

ప్రియసోదరులారా! పోరాడే సైనికులారా! నేటికి స్వాతంత్ర్య యుద్ధంలో అయిదేండ్లు గడచాయి; చైనా ప్రజలు సాటిలేని ధైర్యం, పట్టుదల, ఓర్పు ప్రదర్శించారు. బాధలకు వెనుకంజ వేయలేదు. త్యాగమన్నా, దారుణకష్టాలు సహించడమన్నా భయపడక మహత్తర శక్తిని చాటారు. జపాన్ సామ్రాజ్యవాదుల్ని తరిమివేసి, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో అలరారే నూతన చైనాను సృష్టించేవరకు ఇదే పట్టుదల, ధీమాలను కలిగి ఉంటా రని మేము విశ్వసిస్తున్నాం.

చైనా కమ్యూనిస్టు కేంద్రకమిటీ

1942 జులై 7 చైనా రిపబ్లిక్ 31వ వార్షికోత్సవం.

## స్వాతంత్ర్యయుద్ధ ఆరవ వార్షికోత్సవ సందర్భంలో

# చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ప్రణాళిక

(1943 జులై 7.)

చైనా ఏకమై దుష్ట ఫాసిస్టు జపాన్నెదిర్చి గత ఆరు సంవత్సరాలుగ యుద్ధంచేసింది. మనకిది పర్వదినం. మనమీ ఆరవ వార్షికోత్సవం జరుపు సమయంలో ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేకపక్షంయొక్క, ఫాసిస్టుపక్షంయొక్క బలాబలాల్లో పెద్దమార్పు జరుగుతోంది. చైనా కమ్యూనిస్టు కేంద్రకమిటీ ఈ విషయంపై తన దృక్పధాన్ని ప్రజలకు, సైనికులకు, కమాండర్లకు తెలియ పరుస్తుంది.

ప్రపంచ ఫాసిస్టు దురాక్రమణశక్తులు అధర్మయుద్ధం ప్రారంభించిన మొదటిరోజుల్లో ఫాసిస్టు వ్యతిరేకపక్షమూ, చైనా ఘోరయుద్ధాలుచేశాయి. కాని దెబ్బకాచుకొనే స్థితిలోనే ఉండిపోయాయి. నేడు అట్టి పరిస్థితులు పూర్తిగ మారిపోయాయి.

అంతర్జాతీయంగా ఇలాంటి స్పష్టమైన మార్పుకు కారణాలేమిటి? సోవియట్ రష్యా సాగించిన దిగ్విజయ రెండవ చలికాల దండయాత్ర, ఉత్తరాఫ్రికాలో బ్రిటన్, అమెరికన్ సైన్యాలవిజయం, స్వాతంత్ర్యయుద్ధంలో చైనా కొట్టిన గట్టిదెబ్బలు. గత సంవత్సరంలో బ్రిటన్, అమెరికాలు పసిఫిక్ రంగంలో సాగించిన ప్రతిఘటన ప్రధాన కారణాలని స్పష్టం.

వీటన్నింటిలోనూ రెడ్ ఆర్మీ స్టాలిన్‌గ్రాడ్ విజయం, అతిప్రాముఖ్య స్థానం పొందింది. మొత్తం యుద్ధగతినే, మార్పుచేసింది.

నిరుడు సాధించిన ఈ విజయాలతో ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేక పక్షానికి అత్యంత అనుకూల పరిస్థితులు, ఫాసిస్టుముఠాకు క్లిష్టమైన వ్యతిరేక పరిస్థితులు వచ్చాయి.

### సంయుక్తదేశాలు — అనుకూల పరిస్థితులు

ఫాసిస్టు వ్యతిరేకపక్షం నేడు ఇదివరకెన్నడూ లేనంత ఉచ్చదశలో ఉంది.

1. ఇటు ఉత్తరాఫ్రికాలోను, అటు స్టాలిన్‌గ్రాడ్‌వద్ద ఒకే పర్యాయం యుద్ధం సాగింది. ఇదే మొట్టమొదటి సోవియట్ - ఆంగ్లో అమెరి

కాల జాయింటు దండయాత్ర. దీనితో సోవియట్ - ఆంగ్లో - అమెరికాల ఐక్యత మరింత సంఘటితమయింది. ఫాసిస్టు దురాక్రమణదారులు, రాజీ బేరాలతో మిత్రమండలి ఐక్యమత్యాన్ని విచ్ఛిన్నంచేయలేక విఫలులయ్యారు.

ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో ఇది ఒక చరిత్రాత్మక సంఘటన

2. చైనా, సోవియట్‌రష్యా, బ్రిటన్,అమెరికాలు ఫాసిస్టు జర్మను, ఇటాలియన్ ముఠాలను ఓడించే భయంకర యుద్ధాలు ముందుసంవత్సరం జరుగుతాయి. ముఖ్యయుద్ధాలు గడచిన సంవత్సరమే జరిగిఉండేవి. కాని బ్రిటన్, అమెరికాలు యూరప్‌లో రెండవ రంగం తెరచేనిర్ణయాన్ని అమలు జరుపలేక పోయాయి. అందుచే మరో సంవత్సరానికి వాయిదా పడ్డాయి.

ఏదెట్లున్నా, ప్రస్తుతం సోవియట్‌రష్యా, బ్రిటన్, అమెరికాలు జాయింటుగాచేసిన మొదటియుద్ధం అఖండవిజయం పొందింది. నేడు సోవియట్ - ఆంగ్లో - అమెరికన్ సైనిక, వైమానిక బలాలు అద్భుతంగా వృద్ధయ్యాయి. ఆంగ్లో - అమెరికన్ నావికాబలం పెంపొందింది. కాబట్టి తూర్పునుండి సోవియట్, పశ్చిమయూరప్‌నుండి ఇంగ్లండు - అమెరికాలు జర్మను, ఇటాలియను ఫాసిస్టుముఠాను చావుదెబ్బలు కొట్టగల్గిన సమయ మాసన్నమయింది త్వరలో రెండవరంగం తెరిస్తే జర్మన్, ఇటాలియన్ గాంగ్‌ను ఈ సంవత్సరమే ఓడించవచ్చు. ఓడించడానికవసరమైన సర్వ సంబారాలు నిరుడు సమకూడాయి. ఈ సంవత్సరం అంతిమయుద్ధాలు జరుగుతాయి.

3. సోవియట్‌రష్యా, ఇంగ్లండు, అమెరికాలమధ్య సంఘటిత మవుతున్న ఐక్యత, జర్మను ఇటాలియన్ ముఠాపై చేసే యుద్ధాలు, జర్మను, ఇటాలియన్ ఫాసిస్టులను ఓడించడమే గాకుండా, జపాన్నుగూడ దెబ్బగొడతాయి. కారణమేమంటే దురాక్రమణదారుల గ్యాంగు నాయకు డైన హిట్లరుపతనం, ఒక హిట్లరుకేగాక ఫాసిస్టుముఠాకంతకు ప్రాప్తి స్తుంది. కొందరు, హిట్లరును అసలు ఓడించగలమనే నమ్మరు. వాళ్లు బుర్ర నుపయోగించి ఆలోచించడంగూడలేదు. లేదా హిట్లరు ఫాసిస్టువిధా నము నాశనం గావడం వాళ్ళకు ఇష్టంగాక పోవాలి. అంటే దాని అర్థం జపాను ఫాసిజంగూడ నాశనం గావడం వారికిష్టంలేదన్నమాట. అలాంటి అభిప్రాయానికి కారణాలు ఇంతకు మించి వుండజాలవు.

4. ఆంగ్లో. అమెరికను విజయాలు. చైనాభల్లూక ప్రతిఘటన. అమెరికా మిలటరీగా బలపడడంతో పసిఫిక్‌లోగూడ మిత్రమండలికి అనుకూల పరిస్థితులు. జపానుకు వ్యతిరేక పరిస్థితులు ఏర్పడ్డాయి. అమెరికా మిలటరీబలం రోజురోజుకూ పెరుగుతోంది. జపాను ఫాసిస్టులు తమ మరగుజ్జుకాళ్ళతో అమెరికాతో పోటీగా పరుగెత్తి పందెం గెలువ ప్రయత్నిస్తున్నారు కాని ఓడిపోవడం తప్పదు.

ప్లాను ప్రకారం అమెరికా యుద్ధపరికరోత్పత్తి ఒక సంవత్సరంలో 1 లక్ష 20 వేల టాంకులు, 2 కోట్ల టన్నులశక్తిగల 2 వేల యుద్ధనౌకలు (పెద్ద, చిన్న) సంయుక్తదేశాల అధీనంలో పెట్టగలదు. ఈప్లానులనుచూచి జపాను ఫాసిస్టులు హడలెత్తిపోతున్నారు.

## అక్షరాజ్యకూటమిలో — క్లిష్టదశ

ఫాసిస్టు దురాక్రమణదారుల పక్షంలో గమనించదగిన ఈ క్రింది మార్పులు జరిగాయి.

(1) ఫాసిస్టు దురాక్రమణదారులముఠా అంతర్జాతీయంగా వెలివేయబడ్డది. గత సంవత్సరం సోవియట్, బ్రిటన్, అమెరికాలుకలసి, జర్మను, ఇటాలియన్ దోపిడి-ంఠాపై మొదటిదెబ్బగొట్టాయి. అమెరికన్ మిలిటరీ బలంతో జపాను గజగజ వణికింది. చుట్టుముట్టియున్న జపాన్ బందిపోటు సైన్యాలమీద చైనా, బ్రిటన్, అమెరికా సైన్యాలు పసిఫిక్, చైనారంగాల్లో గట్టి దెబ్బలుకొట్టాయి. దానితో మొత్తం ఫాసిస్టుదేశాలన్ని ఓటమి ప్రమాదాన్ని గుర్తించాయి. అందుకేవాళ్ళే సంధి రాయబారాలనే కుట్రలతోనూ, ఏదోవిధంగా రెచ్చగొట్టి బ్రిటన్, అమెరికా, సోవియట్ యూనియన్లమధ్య మైత్రిని విచ్ఛిన్నంచేసే ప్రయత్నాలతోనూ హడావిడి పడుతున్నారు.

మిత్రమండలిలో ఒకముఠా తమతో సిగ్గులేకండా రాజీకివస్తుందనీ, ఆవిధంగా రెండవముఠాను నాశనంచేసి, తాము ఓటమి ప్రమాదాన్నుండి బయటపడగలమని చూస్తున్నారు. వినాశనకరమైన తమ ప్రపంచాధిపత్య ఆశయాన్ని యిలా నెరవేర్చుకో ప్రయత్నిస్తున్నారు. ఈ కొంటె యెత్తులకు సమాధానంగా, బ్రిటన్, అమెరికా, సోవియట్‌యూనియన్లు ఏకమై చావుదెబ్బలుకొట్టాయి. కాబట్టి జర్మన్ - ఇటాలియన్ ఫాసిస్టులకుగాని, జపాను ఫాసిస్టులకుగాని, మిగిలిన దొకటేమార్గం: అది 'ఎట్టి షరతులు లేకుండా దాసోహం' అనడం.

ఫాసిస్టుగాంగు, యుద్ధంలో యింకా చేరని తటస్థదేశాలను తమ వలలోవేసికో ప్రయత్నాలు చేస్తాయి. హిట్లరు జర్మనీతో మొదట్లో చేరతా యనుకొన్న తటస్థదేశాలు, ఫాసిస్టులకు పట్టనున్న దుర్గతినిచూచి, దానితో చేర నిష్టపడలేదు. మిత్రమండలికి అనుకూలంగావున్నా, హిట్లరు భయం కర దాడినిచూచి భయపడి, మిత్రమండలిలో చేరుదామా, వద్దా అని వెనకా ముందు ఊగిసలాడే దేశాల ఊగిసలాటలు యిప్పటికి పోయాయి; లేదా పోతున్నాయి. సంధి రాయబారాలు, కుట్రలు నిష్ఫలమయ్యాయి. తటస్థ దేశాలను తమవలలో వేసికోవడం వెర్రి భ్రమఅయిపోయింది. ఫాసిస్టు దురాక్రమణ పక్షం ప్రపంచంలో నేడు వెలిగాకిగా ఉంది.

(2) ఫాసిస్టుపక్ష దేశాలమధ్య ఐక్యత చెడిపోతూంది. ఫాసిస్టు వ్యతిరేక పక్షంయొక్క మిలటరీ రాజకీయ దిగ్విజయ దెబ్బలతో ఫాసిస్టు దేశాలమధ్య ఆంతరంగిక కలహాలు పొడచూపాయి. ఈ కలతలు నేడొక సంక్షోభంగా మారాయి. జర్మనీ–ఇటలీలకు; జర్మనీ–దాని తాబేదారురాజ్యా లకు; జర్మనీ–జపానులకు మధ్య అభిప్రాయభేదాలు వచ్చాయి.

హిట్లరుకు రాజకీయంగానూ, మిలటరీరీత్యా అనేక అపజయాలు వచ్చాయి. అంతటితో అతడి పరువుపోయింది ఇటలీ, జపాను, తదితర తాబేదారు రాజ్యాలను హిట్లరు తన పలుకుబడిలో ఉంచుకోగలశక్తి హఠా త్తుగా క్షీణించింది. ఇటలీలో యుద్ధంనుండి వైదొలగాలనేశక్తులు బలపడు తున్నాయి. జపానులో కేవలం తమదేశాన్ని జర్మనీతో ముడిపెట్టి పూసుకు తిరగాలనే ముఠా ఓడిపోయింది. హిట్లరుకు స్టాలిన్‌గ్రాడ్, ఉత్తరాఫ్రికా లాంటి గట్టిదెబ్బలు మరొక రెండు తగిలితే జపాను పాలకవర్గంలో యే గ్యాంగూ హిట్లరుతో ముడివేసికొని ఉండటానికి సాహసించదు. మొత్తం మీద ఫాసిస్టు దురాక్రమణదారుల పక్షం ఇంటా బయటా ప్రజలనుండి వేరుపడి వెలిగాకియై అఘోరించవలసివస్తోంది.

ఇలా అంతర్జాతీయంగా వేరుచేయబడ్డంవల్ల ఈ ప్రమాదాన్నుండి బయటపడ్డానికి, జపాను బందిపోటునాయకుడైన టోజో ఒక కొత్తయెత్తు వేశాడు. ఆక్రమిత చైనాలో గడచిన సంవత్సరం 'కొత్తపాలసీ' అంటూ ఒకటి బయటకుతెచ్చాడు దక్షిణ సముద్రప్రాంతంలోను, ఆక్రమిత చైనాలోను జాతీయ విద్రోహులను తనబుట్టలో వేసికోడానికి ప్రయత్నించాడు. ఈ విద్రోహులకు టోజో 'స్వాతంత్ర్య బురఖా' తగిలించి, తన ప్రతిష్టను అధి

కం చేసుకోచూస్తున్నాడు. తనను ప్రతిఘటించి పోరాడ సిద్ధంగావున్న చైనా, ఇండియా ప్రజలను మోసంచేయడానికిదొక పన్నాగం. టోజోగారి యీ 'కొత్తపాలసీ' వృత్తాంతం జపాను బలహీనతను మాత్రమే రుజువు చేస్తోంది. జపాను ఫాసిస్టులు అంతర్జాతీయంగా యెలా వెలిచేయబడ్డారో తెలుస్తోంది.

(3) గత సంవత్సరం మిత్రమండలి సాధించిన దిగ్విజయాలవల్ల ఫాసిస్టు ముఠాకొక మిలటరీ సంక్షోభంవచ్చింది. అయినా, సోవియట్‌పై మరొక దండయాత్ర చేయాలనే, హిట్లరు వెర్రి సైన్యాధిపతులు కొందరింకాఉన్నారు. అలాగే సోవియట్‌పై మరోవైపునుండి దాడివెడలాలనేవారు జపాను సైనిక ముఠాలో కొందరున్నారు. కాని మొత్తంమీద ఫాసిస్టు రాజ్యాలకు, సైన్యాలకు 'పరిస్థితులు తమ కనుకూలంగా లేవ'నే అభిప్రాయం నాటింది. చొరవను ఫాసిస్టులనుంచి ఫాసిస్టు వ్యతిరేకపక్షం గుంజుకొంది.

యుద్ధానికి ప్రాణావసరాలైన, మనుష్యశక్తి, మందుగుండు, ఆహార పదార్థాలు మున్నగు వస్తువులు మిత్రమండలి విశేషంగా సేకరించింది. ఈ సంవత్సరం మరింతబలాన్ని సమీకరించి మిత్రమండలి పైచేయిగ వుంటుంది. అక్షరాజ్యాల కూటమిలో జర్మన్ - ఇటాలియన్ల సత్తా ఉడిగి పోతోంది. జపానువాళ్ళ ఉత్పత్తి కాగల్గినంత వృద్ధయింది. ఇంకా అధికం చేయజాలదు. ఈ పరిస్థితులన్నిటివల్ల ఫాసిస్టు రాజ్యాలకొక మిలిటరీ సంక్షోభం వచ్చింది.

(4) ఫాసిస్టురాజ్యాలను అన్నిటికి మించిన రాజకీయ సంక్షోభం చుట్టుముట్టింది. ఈ ముఠా అంతర్జాతీయంగా వెలి చేయబడుటవల్ల, అంతరంగిక కలహాలవల్ల, మిలిటరీ అపజయాలవల్ల, ఫాసిస్టు ఆక్రమితదేశాల్లో వారుసాగించే అమానుష క్రూర పరిపాలనవల్ల ఈ దుస్థితి యేర్పడింది.

అక్షరాజ్యాల్లో ప్రజలకు - ప్రభుత్వానికి, సైనికులకు—సైనికాధిపతులకు మధ్య అఘాతం ఏర్పడి రోజురోజుకు పెరిగి అగ్నిపర్వతంలా బ్రద్దలయ్యే స్థితి ఏర్పడుతోంది.

ఈ రాజకీయసంక్షోభం, ఫాసిస్టులను క్రిందినుండి మందుగనివలె పేల్చివేస్తుంది. ఫాసిస్టుదేశాల్లోనూ, అంతర్జాతీయంగానూ, ఏర్పడ్డ రాజకీయ సంక్షోభం పక్వమై పండి పగులుతుందనడంలో సందేహంలేదు.

1918 లో జర్మను - ఆస్ట్రియా సామ్రాజ్యవాదులదుస్థితిని గుర్తిస్తే ఈసంగతి బాగా అర్థమవుతుంది.

అంతేగాక ఆక్రమిత చైనాలోని ప్రజాభిప్రాయం, జపానుసైనికుల మానసిక స్థైర్యములలో పెద్దమార్పు వచ్చింది. ఈ మార్పులు ఇలాగే ముందుకు సాగితే జపాను దుండగీళ్ళను గూడా ప్రత్యక్ష సంక్షోభం అవరిస్తుందనడంలో ఆశ్చర్యంలేదు. జపాను ప్రజలే ఒక అగ్నిపర్వతంలా ఉన్నారు. జపాను ఆక్రమిత చైనా, కొరియా, ఫార్మోసా దేశాలప్రజలు మరికొన్ని అగ్నిపర్వతాలవలె కుములుతున్నారు. ఫాసిస్టు వ్యతిరేకపక్షం చైనాతో చేయిగలిపి, జపానుపై ఒక మిలటరీదెబ్బ గొడితే అవన్నీ పెద్ద పెట్టున ప్రేలుతాయి.

## ఆరు సంవత్సరాల వీరోచిత పోరాటం

సోదర దేశీయులారా! సైనిక, సైనికాధిపతులారా! ఆరుసంవత్సరాలనుండి మనం చైనా రక్షణకై యుద్ధం చేస్తున్నాం. యుద్ధాన్ని అతి క్లిష్టపరిస్థితుల్లో సాగించాం. మనదేశం సోవియట్‌రష్యా, ఇంగ్లండు అమెరికాలవలె పారిశ్రామికాభివృద్ధి గాంచక వ్యవసాయక దేశంగా ఉంది. అయినప్పటికి అనేక దుస్సంఘటనలను ఎదుర్కొని, ఏ దేశమూ స్వరక్షణకై పోరాడనంతకాలం (ఆరుసంవత్సరాలు) యుద్ధంచేశాం.

మన ప్రజలు, సైనిక, సైన్యాధిపతుల ఐకమత్యంవల్లనే ఇంతపని చేయగలిగాం. ఈ ఆరుసంవత్సరాల కాలంలో అనుకూలశక్తుల, వ్యతిరేక శక్తుల బలాబలాల్లో గొప్ప మార్పువచ్చింది మనకు, మన మిత్రమండలికి అనుకూలంగానూ, ఫాసిస్టులకు వ్యతిరేకంగానూ పరిస్థితులు పరిణమించాయి. పై సంవత్సరంలో మరికొన్ని కొత్తమార్పులు మన కనుకూలంగా వచ్చితీర్తాయి.

యూరప్‌లోని ఫాసిస్టుమును మిత్రమండలి చావగొడితే ప్రపంచంలోని హెచ్చుభాగం ప్రజలు విముక్తి పొందుతారు. అప్పుడుతూర్పు దేశంలోని ఫాసిస్టులపనిబట్టి సులభంగా ప్రజలను విముక్తిచేయ సాధ్యమౌతుంది.

యూరప్, ఆసియాలలో విజయం సాధించి విముక్తి పొందాలంటే ఇంకా ఎన్నోకష్టాలు సహించాలన్న సంగతి మనకు విశదమే. అంత శ్రమపడనిదే విజయము, విముక్తి అసంభవం. అంతర్జాతీయ పరిస్థితు

లింత అనుకూలంగా ఉన్నపుడు. మిత్రమండలిలో ఒకభాగంగా ఉన్న మనం ఏ రకంగా కృషిచేయాలి ?

మనదొక వ్యవసాయక దేశం. పారిశ్రామిక దేశాలతో వంతు పెట్టుకొని పోల్చరాదు. కాని మనకు విశాల భూభాగము, కావలసినంత జనాభా ఉండటంచే ఒకవాటం ఉంది. అంతేగాదు. మనప్రజలు ఎక్కువ పట్టుదలతో పోరాడతారు. ఆరు సంవత్సరాలుగ మనంచేసిన ప్రతిఘటనా యుద్ధాలే అందుకు నిదర్శనం. అయితే మనం సోవియట్, అమెరికా, బ్రిటనులతో కలసి నిర్వహించవలసిన బాధ్యతలను విజయవంతంగా నిర్వహించేదెట్లా ? ఆరేండ్ల యుద్ధంలో మనం గొప్ప అనుభవాల్ని గడించాం. ఆ అనుభవాలేమిటి ? వాటిని ఉపయోగించి మన ముందున్న చిక్కు సమస్యల నెలా పరిష్కరించుకో గలము ? శత్రువుపై ఇకముందు చేయ బోయే తిరుగుదాడిని దిగ్విజయంగా కొనసాగించుటకు మార్గమేమి ?

## యుద్ధరంగాన్ని — శత్రువు వెనుకభాగాన్ని దిట్టపర్చాలి

చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ ఈక్రింది విధంగా అభిప్రాయ పడుతోంది—

మన పోరాటశక్తిని ఎక్కువ చేయాలి. గడచిన ఆరుసంవత్సరాల్లో చైనా యుద్ధరంగం, యదార్థంగా రెండు రంగాలుగ చీలిపోయింది. ఒకటి ప్రత్యక్ష యుద్ధరంగం. రెండవది శత్రువు వెనుకభాగంలో యుద్ధ రంగం. ఈ రెండూ పరస్పర సహాయకారులుగ ఉంటాయి. ఏది బలహీన మయినా, లోపించినా ప్రస్తుతం శత్రువును ఆపివేయడంగాని, ముమ్ముందు చైనా గడ్డనుండి తరిమివేయడంగాని సాధ్యంగాదు.

అందుకే ఈ రెండురంగాలకు పరస్పరసహకారం ఎక్కువచేయాలి. ముఖ్యంగా జపాను ముష్కరసైన్యాల్లో సగభాగానికి పైగా సైన్యాన్ని, శత్రువు వెనుకభాగంలోని ప్రజలు, సైనికులు ప్రతిఘటిస్తున్నారు. ప్రత్యక్ష యుద్ధరంగంలోపోరాడే సైనికులకన్నా వీరు నూరురెట్లు ఎక్కువ శ్రమపడాలి.

వారికి సహాయం అధికంచేయడం అత్యవసరం. ఏమాత్రం అశ్రద్ధ చేయరాదు మొత్తం చైనా యుద్ధరంగాన్ని బలపర్చాలంటే ఈ రెండు రంగాల పరస్పరసహాయం ఎంతో ఎక్కువ కావాలి. ముఖ్యంగా శత్రువు వెనుకభాగంలోని గెరిల్లా దళాలకు ప్రజలకు అధికంగా సాయం చేయాలని మా విశ్వాసం.

లోగడ కొన్ని సంవత్సరాలనుండి శత్రు వెనుకభాగంలోని సైనికులకు, ప్రజలకు చేసిన సహాయమేమీ లేదనే చెప్పాలి. ప్రత్యక్ష యుద్ధరంగంలోగూడ పోరాటస్థాయి చాల తక్కువలోఉంది. ప్రభుత్వం దీన్ని అభివృద్ధి చేస్తుందని నమ్ముతున్నాం.

జపాను బందిపోటుగాళ్లు, వాంగ్-చింగ్ వే విద్రోహికలసి చేసిన కుట్రలవల్ల మిలిటరీలో పై తరగతుల్లోని 33 గురు ఆఫీసర్లు తమ సైన్యాలతో సహా శత్రువశమయ్యారు. మాతృదేశానికి ద్రోహం చేశారు. అయినప్పటికి మనప్రభుత్వం అట్టివారిపై ఎట్టిచర్యాగైకొన్నట్లు మనం వినలేదు. అందుకనే వాంగ్-చింగ్ వే, యొక్క సైనికసంఖ్య విపరీతంగా పెరుగుతోంది. జపాను ఫాసిస్టులు, వాంగ్‌చింగ్‌వే 'కొత్తపాలసీ' అనే మోసపు ప్రచారాన్ని జోరుగా సాగిస్తున్నారు.

ప్రభుత్వం ఈవిషమపరిస్థితిని చక్కబర్చడానికి, సైనికుల మనోనిబ్బరాన్ని వృద్ధిచేయడానికి, కొన్ని చర్యలు తీసుకొంటుందని ఆశిస్తున్నాం. యుద్ధప్రతిఘటన హెచ్చాలంటే ఇది ఎంతో అవసరం.

మన పోరాటబలాన్ని అధికం చెయ్యాలంటే, నిర్బంధ సైనికశాసనంలో కొన్నిసంస్కరణలను వెంటనేప్రకటించాలి. ప్రస్తుతం అమల్లోనున్న నిర్బంధసైనిక శాసనంలో చాల లోటుపాట్లున్నాయి. అరెస్టులు, నిర్బంధాలు, లంచగొండితనం. రాజకీయసమీకరణ అశ్రద్ధచేయడం, మొదలైన లోపాలున్నాయి. అందుచేత యుద్ధరంగానికి విశాల ప్రజాసమీకరణ సాధ్యం కావటంలేదు. వీటిని సరిదిద్దనిదే ముందుకు పోజాలం. ప్రభుత్వం వెంటనే ఈ లోపాలను సర్దుబాటు చేస్తుందని విశ్వసిస్తున్నాం.

## జాతీయైక్య సంఘటనను నిర్మించాలి

ఐక్యతను బలపర్చాలి. చైనాలో నేటి పరిస్థితుల్లో ఉండగూడని సంఘర్షణ, తగాదాలు, నిర్బంధాలు మున్నగునవి ఇంకా ఉన్నాయి. వాటిని మేమిక్కడ ఏ కరువు పెట్టము. ప్రభుత్వంమాత్రం ఇకముందు అట్టి ఆటంకాలన్నిటిని తొలగించుతుందని మేము నమ్ముతున్నాం.

కమ్యూనిస్టులమైన మేము జపానువ్యతిరేక జాతీయ సంఘటననూ, ప్రభుత్వ యుద్ధసన్నాహాలనూ, ఎల్లప్పుడూ బలపరుస్తున్నాం. రోజురోజుకు పెరిగే ఈ గడ్డుసమస్యలను, ఆటంకాలను పూర్తిగ పరిష్కరించి, మిత్ర

రాజ్యాలతో చేతులుకలిపి జపాను శత్రువుపై ఎదురుదెబ్బ తీయాలి. అందుకు కొమింటాంగ్, ఇతర జపాను వ్యతిరేకపార్టీలతో కలసి చర్చించి అన్ని సమస్యలను పరిష్కరించడానికి, అవసర రాయబారాలు సాగించడానికి, మేము సంసిద్ధంగా ఉన్నాం. ఉన్న సంబంధాలను అభివృద్ధి చేసుకోడానికి కృషిచేస్తాం.

జపానుతో యుద్ధానికి ఆదినుండి అంతంవరకు చైనాప్రజల ఐక్యతే వజ్రాయుధంలాంటిది. ఐక్యతనేది ఒక చైనాప్రజలకేగాక, ఫాసిజంమీద పోరాడే ప్రపంచ ప్రజలందరికి మూలసూత్రం. అన్నిటికంటె ప్రధాన సమస్య. మిత్రదేశాలతో చేతులుకలిపి జపానుతోపాటు ప్రపంచ ఫాసిజాన్ని నిర్మూలించడమని మనమంతా గుర్తించాలి.

దేశంలోని ఆంతరంగిక రాజకీయ పరిస్థితులను చక్కబరచాలి. జపాను వ్యతిరేక పోరాటాన్ని బలిష్టమొనర్చుట కవసరమైన రాజకీయ మార్పు లేమిటో, మాఅభిప్రాయాల ననేకసార్లు ప్రకటించాం. డాక్టర్ సన్యట్ సేన్ యొక్క మూడు ముఖ్యసూత్రాలు ఆచరణలో పెట్టడమే ప్రధాన పాలసీగా భావిస్తున్నాం. జపాను ముష్కరులు దండయాత్రకు తెచ్చినసైన్యం మొత్తం 30 డివిజన్లకు మించిలేదు. అయితే 40 కోట్లప్రజలుగల మన గొప్పదేశం, జపానుపై అఖండ విజయము సాధించకపోయినా, దాన్నిఓడించకపోయినా అర్థమేమిటి? మనం పారిశ్రామికంగా అభివృద్ధికాలేదనడమే ముఖ్య కారణమా? అదొక్కటే కారణంగాదు; ముఖ్య కారణమంతకంటె కానేరదు.

ప్రధానకారణ మేమంటే, చైనాలో ప్రజాస్వామిక ప్రభుత్వంలేదు; అందుచే చైనాప్రజలు తగినంతగా యుద్ధంలో పాల్గొనడంలేదు; యుద్ధం సాగి కాలం గడిచినకొలది ప్రతిఘటనాశక్తి ఎక్కువయ్యే సోవియట్ అమెరికా, ఇంగ్లండులవలెగాక మన చైనాలో ఇప్పటికే చాల ప్రదేశాల ప్రజల్లో ప్రతిఘటనాశక్తి క్షీణించిపోయింది. అనేక అనవసర ఆటంకాలు, ప్రతిబంధకాలు, ప్రజలకు కల్గించడమే అందుకు ముఖ్యకారణం. జపాను వ్యతిరేకయుద్ధంలో మొదటి రెండుసంవత్సరాలు ఉన్న ఉత్సాహఉద్రేకాలు తరువాత కాలంలో క్రమంగా క్షీణించిపోయాయి.

నేడున్న రాజకీయ నిర్బంధాలు, ప్రతిబంధకాలు, నిర్మూలించడానికి అవసర సంస్కరణలను అమలుపర్చకపోతే ముందు ఇవే యుద్ధయత్నాలకు తీరని సంకెళ్లుగా పరిణమిస్తాయి. అంతేగాక వివిధ వర్గాల, రాజకీయ పార్టీలమధ్య సంఘర్షణలు వస్తాయి. పరస్పర సహకారం, ఐకమత్యం

అత్యంతావసరమయిన ఈ రోజుల్లో చైనా ప్రజల్లో ఆంతరంగిక కలహాలు యుద్ధకృషిని కుంటువడ చేస్తాయి.

మన స్వాతంత్ర్యయుద్ధం ఆరేండ్లుగడిచి ఏడవ సంవత్సరంలోకి వచ్చాం. ఇప్పటికైనా మన ప్రభుత్వం అవసర సంస్కరణలు ప్రవేశపెట్టి, వివిధ పార్టీల మతాల, ప్రజలమధ్య ఐకమత్యం, స్నేహం ఏర్పరుచుటకు తోడ్పడుతుందనీ, శత్రువుపై తిరుగుదాడి ప్రయత్నాలకు దోహద మిస్తుందనీ నమ్ముతున్నాం.

## అధికోత్పత్తి గావించండి

ఉత్పత్తిని అధికం చేయాలి. మనం దీనివిషయం పలుమార్లు హెచ్చరించాం. ఇప్పుడే ఆర్థికసమస్యలు అతి క్లిష్టమైనాయి. సకాలంలో సరయిన పద్ధతులవలంబించకపోతే క్రమేణా, ఎక్కువవుతున్న ఆర్థికచిక్కులను తీర్చలేము; బలమైన తిరుగుదాడులను సాగించడం సంభవంగాదు.

వివిధవర్గాల ఆర్థిక ప్రయోజనాలను సమన్వయంచేసి, ఉత్పత్తిని విరివిగా సాగించునట్లు మన ఆర్థిక పాలసీని ప్రజాస్వామ్య పద్ధతులపై కేంద్రీకరించాలి. అప్పుడేమనం జయప్రదంగా యుద్ధనిర్వహణ చేయగలమని మా అభిప్రాయం.

ఒకవైపు యుద్ధము, మరోవైపు యుద్ధావసర పరికరాల ఉత్పత్తి సాగించుటకు దేశంలోని సైనికశక్తినంతా సమీకరించాలి.

అన్ని విద్యాసంస్థలు, స్కూళ్ళు, ఒకవైపున చదువుతోపాటు పనిపాటలుగూడ చేస్తూ ఉత్పత్తిని సాగించాలని, అందుకు అవసరమైన సమీకరణ చేయాలని మేము కోరుతున్నాం.

భూమిశిస్తును తగ్గించి, తక్కువ వడ్డీరేట్ల నమలుపరచి రైతాంగాన్నంతా అధికాహారోత్పత్తికి సమీకరించాలి.

కార్మికుల జీవితపరిమాణాన్ని పెంచుతూ ఉత్పత్తిని అధికం చేయాలి. ఇందుకు కార్మికులందర్ని వెంటనే ప్రోత్సాహపరచాలి. చిన్న, మధ్యరకం పరిశ్రమలను పెద్ద నిరంకుశ పెట్టుబడిదారుల, వర్తకుల దాడి నుండి రక్షించాలి.

ఈ నూతన ఆర్థిక విధానాన్ని ఒకవైపున అమలుపరుస్తూ, మరోవైపు నేడు పబ్లిక్, ప్రయివేటు పరిశ్రమలకున్న ఆటంకాలను తొలగిం

చాలి. ఆర్థిక సంక్షోభాన్నుండి బయటపడాలంటే, ఉత్పత్తి అధికం కావా లంటే ఇది ఒకటేమార్గమని మా అభిప్రాయం.

యుద్ధాన్ని గెలవాలంటే చాల సమస్యలను పరిష్కరించాలి. ప్రస్తుతం మేము పై నాలుగువిషయాలనుమాత్రం ప్రభుత్వానికి సూచించాం. యుద్ధానంతర పునర్నిర్మాణానికై మేము పంచమ వార్షికోత్సవ సమ యంలో ప్రకటించిన ప్రణాళికయే సరిపోతుంది. ఈ దేశప్రజలంతా దాంతో ఏకీభవించారు. మరల దాన్నిచట పేర్కొన పనిలేదు.

విజయం అందుబాటులోకి వచ్చినకొలది, మనల్నెదుర్కొనే కష్ట సమస్యలు ఎక్కువవుతాయి. ప్రభుత్వానికి, ప్రజలకు, కమ్యూనిస్టులకు గూడ బాధ్యతలుభారమవుతాయి. అందులో శత్రువెనుక భాగాంలో గెరిల్లాయుద్ధం సాగిస్తున్న కమ్యూనిస్టులపై మరింత భారం పడుతుంది.

దేశరక్షణార్థమై చేస్తున్న పవిత్రయుద్ధంలో, చైనాకమ్యూనిస్టు పార్టీకిగల విశ్వాసం ఈ ఆరుసంవత్సరాల యుద్ధంలో, ఆచరణలోనే రుజు వయింది. కొత్తనాల్గవసైన్యం, అష్టమసైన్యం శత్రువెనుకభాగంలో ప్రజలు గావించిన భయంకర పోరాటాలు మనం కని విని ఎరుగనివి; మన చరిత్రకు వన్నెదెచ్చే ఘట్టాలు : వారే గత ఆరు సంవత్సరాలనుండి, శత్రుసైన్యంలో సగభాగాన్ని ఎదిర్చి యుద్ధం చేస్తున్నారు. శత్రువును దేశసరిహద్దులు దాట గొట్టేవరకు అదేరీతిగా పోరాడుతారు.

ఆహార పదార్థాలుగాని, యుద్ధసామగ్రిగాని వారికెట్టిసహాయం పంప లేదు. వారి స్వయంకృషిమీద, నిర్మాణబలంమీద విశ్వాసంతోనే ఆశ్చర్యకర మైన విజయాలను సాధించగల్గారు. శత్రుహస్తాల్నుండి విశాలభూభాగాన్ని జయించారు. అచట ప్రజాస్వామిక పద్ధతులపై జపాను వ్యతిరేక కేంద్రాన్ని స్థాపించారు. సన్‌యట్‌సేను మూడు సూత్రాలను తు.చ తప్పక అమలు పర్చారు. భూములకు శిస్తులు, వడ్డీలుచెల్లించేపద్ధతి ఒకవైపు అమలుచేస్తూ, శిస్తు, వడ్డీరేట్లను తగ్గించారు. కార్మికుల వాంఛను సంతృప్తిపరుస్తూనే ఉత్పత్తిని అధికంచేశారు. ప్రజల్లో విజ్ఞాన ప్రచారంచేసి, దేశభక్తిని పురి గొల్పి, పోరాట పట్టుదలను వృద్ధిచేశారు.

వారు పైవిధానాలవలంబించి ప్రజాసమీకరణచేస్తున్నారనే కారణంతో జపాన్ ముష్కరులు, విద్రోహివాంగ్‌చింగ్‌వేలు, వారిపైతీవ్రద్వేషాన్ని వెడల గ్రక్కుతుంటారు. వారిని సర్వనాశనం చేయుటకు విశ్వప్రయత్నాలు చేస్తు

న్నారు. నిరంతరం అతిక్రూరమైన. గాలించి పట్టుకొని హతమార్చే దండయాత్రలు సాగిస్తున్నారు. చిందరవందరగా రక్షణ దుర్గాలను, పెద్దపెద్ద అగడ్తలను, గోడలను నిర్మిస్తున్నారు. అంతూపంతూ లేని. 'చంపే' 'దోచే' తగులబెట్టే విధానాలు ఆచరించబడుతున్నాయి. 'శాంతిని బలపర్చే ఉద్యమాలని' 'కమ్యూనిష్టు వ్యతిరేక కమిటీలని' అంతటా స్థాపించుతున్నారు. ఇదంతా శత్రువెనుకభాగంలోని ప్రజాసైనికులను హతమార్చుటకే ఉద్దేశింపబడ్డది. శత్రువెనుక భాగంలో ఎంత క్రూర పోరాటం జరుగుతూందో తెలియని దేశీయులు ఇంకా కొందరున్నారు.

## ముందు కార్యక్రమం

కమ్యూనిస్టుపార్టీ సభ్యులారా! అష్టమ సైన్య. కొత్త నాల్గవ సైన్య సైనికులారా! శత్రువువెనుకభాగంలోని స్త్రీ పురుషులారా! మీరు ఐకమత్యాన్నభివృద్ధిచేసుకొని ఒకటై నిలబడండి. ఈ క్రూరయుద్ధం మీలో అసామాన్య ధైర్య సాహసాలను, పట్టుదలను పురికొల్పి, పౌరుషాన్ని రేకెత్తించుగాక. అప్పుడు మిమ్ములను ఓడించడానికి శత్రువు తరంకాదు.

కమ్యూనిస్టుపార్టీ సభ్యులారా! ప్రజలతో ఉండండి; ప్రజలను కంటిపాపలాగ కాపాడిండి; వారినే మీ తలిదండ్రులుగ, అక్కచెల్లెంద్రుగ, అన్నదమ్ములుగ విశ్వసించండి పాలనా చాతుర్యంగల, ప్రభుత్వాన్ని బలపర్చు. ప్రజలను ప్రేమించు మంచిరకం సైనికులను సమీకరించు పంథాను ఆచరించండి. ప్రజలకు - ప్రభుత్వానికీ - సైన్యాలకు మధ్య సామరస్యాన్ని చేకూర్చండి.

ముఖ్య సైన్యాలన్నిటిని కలసి పోరాడునట్లు చూడాలి. ప్రత్యక్ష యుద్ధరంగంలోను, శత్రువువెనుక భాగంలోను, జరిగే పోరాటం ఒకదానికొకటి అండగావుండాలి. శత్రువుపై యింకా బలమైన దెబ్బలుతీయాలి. 'గాలించి తుడిచిపెట్టే' దండయాత్రలను ప్రతిఘటించి రూపుమాపాలి. సాయుధ పోరాటాన్ని యెక్కువచేయాలి.

దురాక్రమణను ప్రతిఘటించే పోరాటాన్ని బలపర్చాలి. రాజకీయ, మిలిటరీ కార్యకర్తలు తమ పోరాటానుభవాన్ని ఉపయోగించుకొని, శత్రువు చేసే 'గాలించి తుడిచివేసే' దండయాత్రలను భగ్నంచేయాలి. అందులో నైపుణ్యం సంపాదించాలి. పార్టిజాన్, గెరిల్లా పోరాటాలలో మీరు అరి

తేరిన ఘూరులు. ఆరేండ్లతరబడి మీరు స్వతంత్ర యుద్ధంలో సాధించిన విజయాలెన్నో సువర్ణాక్షరాలతో వ్రాయబడ్డాయి. ఈ దేశస్థులంతా మిమ్ము గూర్చి ఆలోచిస్తున్నారు. మీ మీద గంపెడంత ఆశపెట్టుకున్నారు. మీ రింకా యెన్నోరెట్లు కష్టపడి, మీ పోరాట నైపుణ్యాన్ని అభివృద్ధి చేసికో వాలి. మిలిటరీ, రాజకీయరంగాలు రెండింటిలోను ఆరితేరి యుద్ధరంగాన్ని శరవేగంతో నడుపగల్గాలి. చైనా భూమినుండి శత్రువును తరిమివేయాలి.

జపాను సైనికులను, వాంగ్ - చింగ్ - వే సిపాయీలను మనలోకి త్రిప్పుకోడానికి తగిన ప్రయత్నంచేయాలి. జపాను కమ్యూనిస్టుపార్టీతో గలసి శత్రుసైన్యాల మనోనిబ్బరాన్ని దెబ్బగొట్టండి; నిస్పృహలోకి నెట్టండి. ఈ పని బహుబాగా జరగాలి. జపానీయుల కూలీ, రైతు, సైనిక సంస్థలను స్థాపించండి. జపానువారి యుద్ధ వ్యతిరేక లీగ్‌ను బలపర్చండి. కొరియాలోని జపాను వ్యతిరేకశక్తులను, ముఠాలను బలపర్చాలి. వీరం దరికి చైనాప్రజలతో స్నేహం సమకూర్చి, జపానుఫాసిస్టుల నెదిర్చి పోరే సైనికులుగ తయారుచేయాలి.

సహకార సంఘాలద్వారా ఉత్పత్తినధికంచేయండి. యుద్ధ కార్య క్రమం కుంటుపడనిపద్ధతులపై సైనికులంతా వారి సంస్థలద్వారా 'స్వయం పోషక ఉత్పత్తి' ఉద్యమాన్ని సాగించాలి. దీనివలన సైనికుల జీవితావ సర వస్తువుల సప్లయి బాగా కావడమేగాక ప్రజలపై బరువుభారం తగ్గించ గల్గుతాం. ప్రయివేటు పరిశ్రమలనుగూడ ప్రోత్సహించి పెంచాలి.

పార్టీసభ్యులు గ్రామ జీవితంలోని లోతుపాతులు క్షుణ్ణంగా తెలుసు కోవాలి; పల్లెల్లో ప్రవేశించాలి. వ్యవసాయదారులకు పంటల ప్లాను వేసి పెట్టాలి. పరస్పర సహకారంతో పనులుచేసుకొనే కూలి ముఠాలను ఆర్గ నైజు చేయాలి. సహకార సంఘాలను స్థాపించాలి. ఇదేరీతిగా పనిచేస్తే ప్రజాజీవిత పరిమాణం హెచ్చుతుంది ప్రభుత్వ లేక వ్యక్తి పరిశ్రమల్లో అధికోత్పత్తి ఉద్యమాన్ని లేవదీయాలి. దానితోపాటే షెన్సీ-కన్సూ-నింగ్షా సరిహద్దుప్రాంతాల్లోను, శత్రువువెనుకభాగంలోని జపాను వ్యతిరేక కేంద్రా ల్లోను విశ్రాంతిలేని అధికోత్పత్తి ప్రచారాన్ని సాగించాలి బాగా పనిచేసే కార్మికులను ప్రోత్సాహపర్చండి. ఉత్పత్తి నధికంచేయండి. లంచగొండి తనాన్ని, దుబారాను అరికట్టండి. సోమరిపోతులను శిక్షించండి. ప్రజలకు దూరంగాఉండే నిరంకుశాధికారుల బారినుండి తప్పించుక పనిచేయండి. సర్వం విజయంకోసరమే సాగించండి.

కమ్యూనిస్టుపార్టీసభ్యులు విధేయతతో విజ్ఞానాన్ని, పనులు చక్క పెట్టుకొనే కౌశల్యాన్ని, రాజకీయాలను, సిద్ధాంతాన్ని సదా నేర్చుకుంటూ ఉండాలి. తమలో జీర్ణమై ఉండే మార్క్సిస్టు వ్యతిరేకభావాలను పార ద్రోలడానికి, ఆత్మవిమర్శన పెంపొందించుకోడానికి, భావోద్రేకాలకు గురి కాకుండుటకు, సెక్టేరియన్ తత్వాన్ని తొలగించుకోడానికి అవి తోడ్పడ తాయి. యుద్ధ మెంతభయంకరంగా సాగుతున్నా, ఎంత బరువుబాధ్యతలు గల పని నిర్వహిస్తున్నా, చదవడం ఆపగూడదు. బహు దీర్ఘమైన ఈ మొండియుద్ధంలో మీరు మానవాతీతమైన శక్తి సామర్ధ్యాలు గడించాలి.

శతృవు మిమ్మలను లోపలినుండి, బయటినుండిగూడ సమూలంగా సర్వనాశనం చేయడానికి సాధ్యమైన సర్వవిధాలా ప్రయత్నిస్తున్నాడు. నీవు వందరెట్లు, వేయిరెట్లు నీ జాగ్రతను, కాపలాను హెచ్చుచేసికోవాలి. నిన్ను శోధించి పట్టడానికి శతృవు స్థాపించిన సంస్థలన్నిటిని పైచేయిగా ప్రతి ఘటించుటకు సరికొత్తమార్గాలు అన్వేషించాలి

## ఉత్తమ సాంప్రదాయాలు

అదృష్టవశాత్తు ఈ ఆరవ వార్షికోత్సవం చైనా కమ్యూనిస్టుపార్టీ 22 వ వార్షికోత్సవ సందర్భంలో వచ్చింది. మొట్టమొదట చైనా కమ్యూనిస్టుపార్టీ, జమీందారీ వ్యతిరేక, సామ్రాజ్యవ్యతిరేక కార్యక్రమాన్ని ప్రకటించింది. ఈ ప్రణాళిక ననుసరించి అనేకపర్యాయాలు పాలసీల నిచ్చింది.

గత 22 సంవత్సరాల్లోనూ, కమ్యూనిస్టులు వారి రక్తాన్ని ధారవోసి, ప్రజలమధ్య వారితో నిలిచి, ప్రాణాలొడ్డి పై పాలసీల నమలుపర్చ పోరాడారు. ఆ పాలసీలు అమలుపరిస్తేనే, సామ్రాజ్యవాదంమీద, దాని తోహుకుంగాళ్ళమీద యుద్ధంచేసి చైనా జాతిని విముక్తి చేయగలమను విశ్వాసంతో వారు పోరాడారు.

ఎంత బలవత్తర శత్రువైనా, ఎంత కంటకావృత మార్గమైనా లెక్కచేయకుండా, వెనకా ముందు లేకుండా, నిర్భయంగా, పట్టుదలతో వారు ముందుకు నడిచారు. అంధకారంలో మునిగి కొట్టుకులాడుతున్న చైనా ప్రజలకు మార్గదర్శకులయ్యారు.

గత 22 సంవత్సరాలుగ జరిగిపోయిన చరిత్ర, మనంచూపిన మార్గమే చైనా జాతిపునరుద్ధరణకు, సక్రమమార్గమని ఋజువుచేసింది. నేటినుండి సంపూర్ణవిజయం లభించేవరకు అదేరీతిగా కృషిచేస్తుంది.

కమ్యూనిస్టుల వ్యక్తిత్వంలోనే ఒక ప్రత్యేకతవుంది. వారు తమ స్వంత ప్రయోజనాలకు ప్రాకులాడరు. దేశంకోసం, ప్రజలకోసం ప్రాణాలిస్తారు. ప్రజల్లో పాతుకొని ఉంటారు. వారు ప్రజల బిడ్డలు; గురువులుకూడా. ప్రజలనుండి వేరుగాకుండా వేయికళ్ళతో కాపాడుకొంటారు. ప్రతి సమస్యను పరికించేటప్పుడూ, ప్రజా ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొంటారు. అందుకే ప్రజావిశ్వాసానికి పాత్రులై, వారి కార్యక్రమాన్ని నిస్సందేహంగా కొనసాగించగల్గుతారు.

ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేకయుద్ధమూ, దానితోపాటు చైనా స్వాతంత్ర్య యుద్ధమూ అంత్యదశకు వచ్చాయి. చైనా కమ్యూనిస్టుపార్టీ సభ్యులంతా మాసీతంగ్ నాయకత్వాన ఉన్న కేంద్రకమిటీ నిర్ణయాల నమలుపరుస్తారని ఆశిస్తాం, కేంద్రకమిటీ నిర్ణయాల నమలుపరుస్తూ, తమతమ భాధ్యతలను నిర్వహిస్తూ, కాయశక్తులా పాటుబడాలి. అన్ని అవకాశాలను, తమ యావచ్ఛక్తినీ వినియోగించి, శక్తివంచన లేకుండా జపాను వ్యతిరేక సంయుక్త సంఘటనను నిర్మించాలి. జపాను సామ్రాజ్యవాదంపై విజయం సాధించుటకు, జాతీయప్రభుత్వాన్ని, జనరల్ చియాంగ్ కేషేక్‌ను బలపర్చాలి.

చైనాజాతి విముక్తి చిరస్థాయి అగుగాక!

కేంద్రకమిటీ
చైనా కమ్యూనిస్టుపార్టీ.

---

## 1943 ఆగస్టు 1వతేదీని యీనాన్‌లో ఒకఆహ్వానసందర్భంలో

# కామ్రేడ్ చూ - ఎన్ లే ఉపన్యాసం

కామ్రేడ్సు! మీ హృదయపూర్వక స్వాగతానికి నా ధన్యవాదాలు. మీ మధ్యలేకుండా దూరంగా ఉండి నేనుచేసిన పని బహుస్వల్పం; కాని ఈ మూడు సంవత్సరాల కాలంలోను అంతర్జాతీయ, జాతీయపరిస్థితులు ఎక్కువగా మారాయి. మనపార్టీ ఎంతో అభివృద్ధి చెందింది. బయటదేశాల్లో ఉన్న మాకు ఈ విషయం బాగా తెలుసు.

అంతర్జాతీయంగా, ఫ్రాన్సు పతనాంతరం ఫాసిస్టులు తెచ్చిన భీభత్సం, సోవియట్‌పై హిట్లరు జర్మనీచేసినదారుణ దండయాత్ర, పసిఫిక్‌లో ఆంగ్లో-అమెరికాలపై జపాను 'మెరుపుయుద్ధం, ఒక రష్యాలో తప్పితే తక్కిన దేశాలన్నిటిలో పంచమాంగదళచర్యలు వగైరా మేము చూస్తూనే ఉన్నాం.

మరోవైపు రెడ్‌ఆర్మీ, రష్యాప్రజలు కామ్రేడ్ స్టాలిన్ నాయకత్వాన సాగించే వీరోచిత మిలిటరీ ప్రతిఘటన, అధికోత్పత్తి గమనిస్తున్నాం. లెనిన్‌గ్రాడ్, మాస్కోల రక్షణ, స్టాలిన్‌గ్రాడ్‌యుద్ధం, గత రెండు సంవత్సరాల చలికాల తిరుగుదాడులు, ప్రపంచ ప్రజల మన్ననల బడశాయి.

మిత్రమండలిలో ఫాసిస్టువ్యతిరేక సంఘటన, దాని పురోగమనం కూడ చూచాం. చర్చిల్ - రూజ్‌వెల్టుల అట్లాంటిక్‌ప్రణాళిక, ఆంగ్లో-రష్యన్ ఒడంబడిక, సోవియట్ - అమెరికా సంధి, వాషింగ్టన్‌లో 26 దేశాల ప్రతినిధుల సంతకాలతో చేసికొన్న ఖరారునామా, ఉత్తరాఫ్రికాలో ఆంగ్లో-అమెరికన్ సైన్యాల తిరుగుదాడులు, సిసిలీ ఆక్రమణ మున్నగు ప్రముఖ సంఘటనలు జరిగాయి.

అంతేగాదు. ప్రపంచమంతటా ఫాసిస్టువ్యతిరేకసంఘటన ఎలాపెరుగుతూందో చూస్తున్నాం. ఆక్రమితయూరప్‌లో గెరిల్లాపోరాటాలు, జర్మనీ ఇటలీల్లో ఫాసిస్టువ్యతిరేక ప్రదర్శనాలు, సమ్మెలుజరుగుతున్నాయి. ఫ్రెంచి జాతీయవిముక్తి సంఘంతోసహకారమేగాక, జర్మనుజాతీయకమిటీ గూడా ఏర్పాటు చేయబడ్డది. బ్రిటన్, అమెరికాలలో కమ్యూనిస్టుపార్టీలపై నిషేధం పోయి చట్టబద్ధం చేయబడ్డవి. జపాను కమ్యూనిస్టు నాయకుడు కామ్రేడ్ 'ఒకానో' యీనాన్ వచ్చాడు. ఇవన్నీ గమనిస్తున్నాం.

గత మూడుసంవత్సరాల్లో ఫాసిస్టువ్యతిరేక విముక్తియుద్ధం ప్రమాదదశనుండి వొడ్డెక్కింది, ఓటమిదశనుండి విజయదశకు వచ్చింది. మందకొడి యుద్ధాల దశనుండి తీవ్రదాడులదశకు వచ్చింది. ఈ మార్పులు రావడానికి ముఖ్యకారణం, గత రెండేండ్లుగ సోవియట్‌ప్రజలు, రెడ్‌ఆర్మీ చేసిన అప్రతిహత పోరాటమేనని చెప్పాలి.

మరొక కారణంగూడ ఉంది. బ్రిటన్, అమెరికాలు ఉత్తరాఫ్రికా రంగంలో సాగించిన దిగ్విజయ తిరుగుదాడులు, దక్షిణ పసిఫిక్‌రంగంలో చేసిన గట్టి ప్రతిఘటన, అమెరికాలో బ్రహ్మాండమైన అధికోత్పత్తి, మిత్ర

మండలి యుద్ధసమీకరణ, చైనా దేశస్థులు సాగించే తీవ్రప్రతిఘటన, అందులో ముఖ్యంగా గెరిల్లాపోరాటం పేర్కొనదగిన విశేషాలు.

ముస్సోలినీ పడిపోయాడు. ఫాసిస్టుపార్టీ రద్దుచేయబడింది. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రపంచ ఫాసిస్టుల కేంద్రంలోనున్న బలహీనత విచ్ఛిన్నానికి దారితీసింది. ప్రపంచ ఫాసిజం కాటికి కాళ్ళుచాస్తోంది. ప్రపంచ ఫాసిస్టువ్యతిరేక ప్రజావిజయ సుముహూర్తం దాపుకొచ్చింది. ఒకప్పుడు జోరుగా పనిచేసిన ఫాసిస్టులకు, వాళ్ళ ఏజంట్లయిన పంచమాంగ దళానికి రోజులు దగ్గిరకొచ్చాయి. మీరు ఇటాలియన్ ఫాసిస్టులనాశనం, ఇటలీలోని జర్మన్ పంచమాంగదళంవాళ్ళగతి ఏమయిందో చూడ్డంలేదా ? ప్రపంచ ఫాసిస్టు శిష్యబృందానికి, చైనాఫాసిస్టులకుగూడ ఈగతే పట్టనున్నదని పై ఘటనలే చాటి చెపుతున్నాయి.

మనదేశం విషయమాలోచిస్తే గత మూడేండ్లనుండి యుద్ధంలోని నిస్తబ్ధత అట్లే నిల్చిఉంది. ఈ కాలంలో సోవియట్ - జర్మనీ యుద్ధం, దాని వెనువెంట పసిఫిక్ యుద్ధమూ వరుసగా వచ్చాయి. కాబట్టి జపాను వాళ్లు అటు ఇండియాపైనో, ఇటు రష్యాపైనో పడతారని, చైనాను వదలి వేస్తారని, కొందరు ఊహించ మొదలుపెట్టారు. ఈ ఆలోచనలతో తీవ్ర ప్రతిఘటనా విధానం నుండి, మందకొడి యుద్ధంలోకి దిగజారి, చైనా జోలికి రావద్దనే సూచనను జపాను కందించ చూచారు. ఈ ప్రబుద్ధులే కమ్యూనిస్టు వ్యతిరేకచర్యలు ప్రదర్శించి, జపాను రష్యాపై బడుటకు ప్రోత్సహించారు.

ఎంత తెలివితేటలతో పై కుతంత్రం సాగింప చూచినా జపాను ఈ సలహాలను పూర్తిగ అంగీకరించడంలేదు. జపాను మీరు సాగించే మందకొడియుద్ధ ప్రతిఘటనకు హర్షించి 'సెబాస్' అంటుందేగాని, మీరు అస్త్రసన్యాసం చేసి 'దాసోహం' అని ఓటమి నంగీకరించనిదే వదలి పెడుతుందా ? ఎన్నటికి అట్లు ఊరుకోదు. అవకాశం చిక్కినప్పుడల్లా దాడిచేస్తుంది. మీ కమ్యూనిస్టు వ్యతిరేక చర్యలను ఆమోదించుతుంది. కాని, మీరింకా పూర్తిగా కమ్యూనిస్టు వ్యతిరేకయుద్ధం చేయడంలేదనీ, మీరు కమ్యూనిస్టులను హతమార్చజాలరనీ, తెలుసుకొని తనసైన్యంలో సగానికి ఎక్కువభాగాన్ని ఎనిమిదవ, కొత్త నాల్గవసైన్యాలపై కేంద్రీకరించి హతమార్చడానికి పోరాడుతోంది.

ఈ మూడేండ్లలోను మరికొందరు ఘనులు, బ్రిటన్ - అమెరికాలు జపాన్ను శీఘ్రంగా ఓడిస్తాయనీ, లేకపోతే చైనాకు పుష్కలంగా సరుకులు సరఫరా చేస్తాయనీ ఊహిస్తూ, చైనాకిక ఫర్వాలేదు, చేతులు ముడుచుక కూర్చున్నా విజయం వస్తుందని వెర్రికలలు గన్నారు. తక్కున వ్యవధిలో ఆంగ్లో - అమెరికాలు జపాన్ను ఓడించడం సాధ్యంగాదని చరిత్రయే రుజువు చేసింది.

బ్రిటన్ - అమెరికాలు చైనాకు సహాయం చేస్తాయని ప్రతివారు ఆశిస్తున్నారు. కాని వారి ఉత్పత్తి ప్లానుప్రకారం పూర్తిగావడం అంత సులభమైన పనిగాదు. అదీగాక వారు ముందుగా తమసైన్యాలకు, యుద్ధం తీవ్రంగా జరిగే తదితరరంగాలకు పంపుకొంటారు. బ్రిటన్, అమెరికాలు, జాగ్రతగ పరిశీలించి, ఎవరు కుతంత్రాలు పన్నుతున్నారో, ఎవరు జారిపోతున్నారో తెలుసుకొంటాయి.

అదేగాదు, వూయిషిన్, నాంకింగ్ నుండి చుంకింగ్ వచ్చినదాది నేటివరకు, ఇరుపక్షాలనుండి రహస్య ఏజంట్లు అటు ఇటు మారుతున్నారు. జపాను రేడియో ఏవో సంధిషరతులు ప్రకటిస్తూ, చైనాను అస్త్రసన్యాసం చేయించ ప్రయత్నిస్తోంది. అందుచే మిత్రమండలి తానుచేసే సహాయాన్ని గూర్చి ఎక్కువగా ఆలోచించవలసి వచ్చింది.

ఈమూడు సంవత్సరాలు ఎలాగైనా యుద్ధం ఈడ్వగలిగితే, అంతిమ విజయం వరకు అట్లే బండిలాగవచ్చని కొందరభిప్రాయపడ్డారు. మీరు ఏదో ఒకరీతిగా నానుడుగా బండి దొర్లించాలని ఎంతకోరినా, శత్రువు నిన్ను విడిచిపెట్టడు. పసిఫిక్ యుద్ధం తీవ్రం గాకముందే, యూరప్‌లో హిట్లరు పడిపోకముందే, చైనాసమస్య తేల్చుకోడానికి జపాను ప్రయత్నిస్తోంది. ఇది స్పష్టంగా కన్పిస్తోంది. ఇటీవల జపాను ప్రకటించిన సంధిషరతులు, ముసోలినీ పడిపోబట్టి వచ్చిన ఎత్తులే. ఏదో ఒకవిధంగా కాలంగడిపి పొడిగించడానికి శత్రువు వప్పుకోడు. చైనాలోని అంతరంగిక పరిస్థితు లంతకంటె అనుమతించవు.

ఎక్కువమంది సైనికులను యుద్ధరంగానికి పంపకపోతే చైనా సైన్యంయొక్క మనోధైర్యాన్ని కాపాడగలమా? నిర్బంధ సైనిక సేవా చట్టాన్ని సంస్కరించి, విశేషసైన్య సమీకరణ గావించకపోతే సైనికుల పోరాట నైపుణ్యాన్ని అభివృద్ధి చేయగలమా? ఆర్థికవిధానంలో తగు

మార్పులు తీసికొని రాకపోతే ప్రస్తుత దివాలానుంచి బయటపడగలమా? పరిశ్రమలపై నిరంకుశ పెట్టుబడిదారుల పెత్తనం తొలగించకపోతేను, లంచగొండితనాన్ని అరికట్టకపోతేను, దొంగనిల్వలను నిర్మూలించక పోతేను చైనా ఆర్థిక సంక్షోభాన్నుండి బ్రతికి బయటపడగలదా?

ప్రజలకు స్వాతంత్ర్యం లేకపోతే, ఆహార పరిస్థితిని చక్కబరచక పోతే, కార్మికులశక్తి నభివృద్ధిచేసి అధికోత్పత్తి చేయకపోతే, నిరంకుశ రాజకీయాలను నిర్మూలించకపోతే, తమ ముఠాకు చెందని దేశభక్తులను హతమార్చే దుష్టప్రయత్నాలు మానకపోతే, యుద్ధరంగానికి వెనుకభాగం శాంతితో స్థిమితంగా వుంటుందా?

ఈ అధ్వాన్నపరిస్థితులు తొలగిపోయి, మరల తలెత్తకుండాపోతే తప్ప, చైనా ప్రజలు అంతిమవిజయంవరకు ప్రతిఘటించగలరా? ఇందుకు మనం చెప్పేదేమిటి? మనకు విజయమే కావాలంటే దిగజారుడు పంథామాని చురుకుగా పోరాడాలి. విజయం పొందాలంటే దేశంలో కావల్సింది అంత ర్యుద్ధంగాదు; కొమింటాంగ్ - కమ్యూనిస్టుపార్టీ ఐక్యత. విజయమే రావా లంటే ఉండాల్సింది రాజకీయ నిర్బంధాలుగాదు: రాజకీయ ప్రజాస్వామ్యం.

గడచిన మూడేండ్లలో చైనా ఆంతరంగిక వ్యవహారాలు బహు చెడ్డగా ఉన్నాయని కొందరు గుర్తించారు. అందుకు రహస్య పోలీసు రొమ్ముబలంతో యుద్ధ విజయంవరకు నెట్టవచ్చు ననుకొన్నారు. ఏమైనను మనమీయుద్ధం నిర్వహించేది ప్రజాదాస్యవిముక్తికేగాని జపానులాంటి పోలీసు పరిపాలనకుగాదు. మనం రహస్యపోలీసుశాఖపై ఆధారపడి, యుద్ధాన్ని గెలవాలనుకొంటే-వచ్చేది జపాను పరిపాలనేగాని విజయం గాదని గ్రహించాలి.

చైనా కోమింటాంగ్ అధికారులు ఇలాంటి ఆలోచనలు చేస్తూం డడం పొరపాటు. యుద్ధాన్ని గెలవడానికి మరోమార్గంలేదా? ఉంది. ఆ ఉత్తమమార్గాన్నే షెన్సి-కాన్సూ-నింగ్షా బోర్డర్ రిజియను చూపిస్తోంది. అష్టమ సైన్యం, కొత్తనాల్గో సైన్యం చూపిస్తున్నాయి. చైనాప్రజలు, సిసలైన జపాను వ్యతిరేకపార్టీలు, సైనికులు చాటుతున్నారు. చైనా కమ్యూనిస్టుపార్టీ, దాని నాయకుడు మా-సి-డంగ్ చూపిస్తున్నారు.

జపాను వ్యతిరేక యుద్ధాన్ని శత్రువువెనుకభాగంలో పోరాడుతున్న అష్టమసైన్యానికి, కొత్త నాల్గో సైన్యానికి ఆయుధసామగ్రిగాని, మను

ష్యలనుగాని బయటనుండి సాయంపంపలేదు; ఆహారం, దుస్తులు, మందులు అంతకుముందే లేవు. శత్రుసైన్యంలో సగభాగానికి పైగా యెదిరించి యుద్ధంచేస్తున్న ఈ సైన్యాలు సమస్త వస్తువుల సప్లయికి ప్రజల రెక్కల మీదనే ఆధారపడుతున్నాయి.

అష్టమసైన్యం, కొత్త నాల్గో సైన్యం సాధించిన మిలిటరీ విజయాలను శత్రువుగూడ గుర్తించక తప్పిందికాదు. ఇవంటే జపానువాళ్ళ గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతాయి. జపాన్ను ప్రతిఘటించే సర్వశక్తులకు ఈ సైన్యాలు ఆదర్శప్రాయంగాదూ ? అలాంటి వుత్తమ సైనికశక్తుల్ని నాశనం చేయాలనేవారు జపానువాళ్ళ ఏజంట్లయిన పంచమాంగదళంగాక మరేమిటి ?

ప్రజా ప్రభుత్వస్థాపన విషయం చూదామంటే, బోర్డర్ రిజియన్ లోను, జపాను వ్యతిరేక పోరాట కేంద్రాల్లోను మన పార్టీయే నూతన పరిపాలనా విధానాన్ని ఆచరణలో పెట్టింది. మూడనవంతు పద్ధతిపై ప్రజా ఎన్నికలు జరిపింది. వ్యక్తుల ప్రైవేటు ఆస్థిహక్కులు గౌరవించబడ్డాయి. శిస్తు, వడ్డీరేట్లు తగ్గించాం. కాని యుద్ధ నిర్వహణకు న్యాయమనితోచిన కొంత భాగాన్నిచ్చుటకు ఏర్పాట్లు చేయబడ్డాయి. కార్మికుల జీవిత ప్రమాణాన్ని చక్కపర్చాం. రోజుకు 10 గంటల పని పద్ధతి నమలుపర్చి అధికోత్పత్తిని సాగిస్తున్నాం. నిర్బంధ సైనిక సేవాచట్టాన్ని సంస్కరించి ప్రజలు వాలంటీర్లుగ మిలిటరీలో చేరునట్లు చేసింది. ఆర్థిక, వైజ్ఞానిక, విద్యావిషయాల్లో, వారివారి అభిరుచికొలది ఏదోఒక శాఖతీసికొని, జపాను వ్యతిరేక పోరాటానికి తోడ్పడేలా అవకాశాలీయబడ్డాయి. ఈ ప్రకారం ఆహారం, బట్టలు, ఆయుధాలు మున్నగునవి స్వయంపోషకంగా ఉండునట్లు పార్టీ ప్రయత్నిస్తోంది. సన్‌యట్‌సేన్ మూడుసూత్రాల నమలుపర్చాలనే ప్రదేశాలకన్నిటికి ఆ బోర్డర్‌రిజియన్ ఆదర్శంగాదా ? బోర్డర్‌రిజియన్‌పై దండెత్తాలని, దాన్ని రద్దుచేయాలని కోరేవారంతా ప్రజాతంత్రానికి వ్యతిరేకులైన ఫాసిస్టులుగాక మరెవరు ? వారు సన్‌యట్‌సేన్ మూడు సూత్రాలను వ్యతిరేకించుటలేదా ? కాబట్టి దేశక్షేమాన్నికోరే యే దేశభక్తుడూ, ఒకవైపు కమ్యూనిస్టులతోనూ, మరోవైపు జపానుతోనూ పోరాడాలనే కోమింటాంగ్‌వారి ఊగిసలాట పంథాను అంగీకరించడు. అలాంటి సద్భావం గలవారంతా అష్టమసైన్యం, కొత్తనాల్గవసైన్యంయొక్క స్నేహాన్ని

ఆశించి, వారి అనుభవాల్ని స్వీకరిస్తారు. వారు చైనా కమ్యూనిస్టుపార్టీతో నిజమైన ఐక్యతను కోరుతారు. జాతీయైక్య సంఘటనను బలపరుస్తారు.

ఇంతకూ జరిగిన మూడేళ్ళు ఏసైన్యాలు తెగబడి యుద్ధం చేస్తున్నాయో, ఏసైన్యాలు మందకొడిగా నానుడుయుద్ధాలు సాగిస్తున్నాయో అందరకు తెలుసు. చైనాలో ఏప్రాంతాల్లో ప్రజాప్రభుత్వం అమల్లోఉందో, ఏప్రాంతంలో నిరంకుశపరిపాలన ఆచరింపబడుతున్నదోగూడ ఎల్లరకు తెలుసు. ఈ విషయం అందరకు తెలియడమే గాకుండా, చైనాలోనూ ఇతర దేశాల్లోను బహిరంగంగా చాటబడుతోంది.

ఇక మనం ఈ మూడు సంవత్సరాలుగ సాధించిన ప్రఖ్యాత విజయాలను చర్చించుదాం. లోగడ 20 సంవత్సరాలకంటె మనపార్టీ గత మూడేళ్ళలో ఎక్కువ అభివృద్ధయి గొప్పవిజయాన్ని సాధించింది.

మన దేశాన్ని అంతర్యుద్ధంలో ముంచెత్తే రెండు దుస్సంఘటనల నుండి మనపార్టీ కాపాడింది. (కొత్త నాల్గవసైన్యంపైదాడి, బోర్డర్ రిజయన్‌పై దండయాత్రాకుట్ర) మనం అతికష్టతరమైన గెరిల్లాయుద్ధాన్ని సాగించాం. అష్టమసైన్యం, కొత్త నాల్గోసైన్యాల నాయకత్వాన్ని బలపర్చాం. మొత్తం ప్రజల్లోనూ, ఆక్రమిత ప్రాంతాల్లోనూ జపాను వ్యతిరేక భావాన్ని పెంపొందించి, విజయంలో విశ్వాసం గలుగజేశాం.

అంతర్జాతీయరంగంలో వచ్చే మార్పులను గత మూడేండ్లుగ ముందు మనపార్టీయే గుర్తించింది. ప్రపంచ ఫాసిజమ్ నాశనమవుతోందనీ, ప్రజాశక్తులు విజయం పొందుతాయని తెలియచేశాం. ఆసియారంగంలో, చైనాకమ్యూనిష్టుపార్టీ, అష్టమ కొత్త నాల్గవసైన్యాలు జపాను వ్యతిరేక పోరాట కేంద్రాలు జపానుపై తిరుగుదాడికి బలీయమైన పునాదులుగ ఉంటాయని, మిత్రరాజ్యాలకు గుర్తింపచేశాం.

మనం పార్టీనాయకత్వాన బోర్డర్ రిజియన్‌లో అమలుపర్చిన సంస్కరణల ఫలితంగా పెద్ద మార్పులువచ్చాయి. నూతన భావసంచలనం గల్గింది. సైన్యంయొక్క నైపుణ్యం వృద్ధయింది. పరిపాలనలో డొంక తిరుగుడు పద్ధతులుపోయి సూటిగ సాగిపోతోంది. ఒకవంక ప్రభుత్వాన్ని బలపర్చడం, మరోవంక ప్రజాసేవ చేయడంతో సైన్యానికి, ప్రజలకు, ప్రభుత్వానికి, కమ్యూనిస్టుపార్టీకి మధ్య అభేద్యమైన ఐక్యత లభించింది. అధికోత్పత్తిని సాగించడంవల్ల స్వయంపోషకత్వానికి పునాదులు

యేర్పడినాయి. కేడరునుపరీక్షించడం, అర్థంచేసికోడం జరిగింది. దాంతో మన పార్టీలో యెప్పటికంటె ఐక్యతచేకూరి సంఘటితపడింది.

పై విజయాలను మనమెలా సాధించగల్గాం? ప్రజా బలంపైన, కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ యొక్క ఐక్యతపైన ఆధారపడి, మా-జి-డంగ్ నాయకత్వాన సాధించాం. గత మూడుసంవత్సరాల్లో వచ్చిన ఏ చిక్కు సమస్యల్లోనూ, మా-జి-డంగ్ నాయకత్వాన మనపార్టీ తప్పులు చేయలేదు; దారి తప్పలేదు.

గత మూడేండ్లుగ జరిగిన చరిత్రయే ఇందుకు నిదర్శనం. మా-జి-డంగ్ నాయకత్వాన్ని యెదిరించేవారు యెలా తప్పు ధోరణిలోపడ్డారో, స్పష్టంగా తెలిసింది.

22 సంవత్సరాల మనపార్టీ చరిత్ర ఒకే ఒక విషయాన్ని రుజువు చేస్తోంది: అది మా-జి-డంగ్, మార్క్సు సిద్ధాంతాన్ని చైనా పరిస్థితుల కన్వయించిపని చేయుటకు పోరాడటమేనని మనంగుర్తించాలి. ఇదే చైనా కమ్యూనిస్టుపార్టీ పంథా. ఇదే చైనా బోల్షివిక్కుల విప్లవమార్గం. మనం కమ్యూనిస్టుపార్టీని, మన నాయకుడైన మా-జి-డంగ్‌ను చూచి గర్వపడాలి.

కాని మన దేశంలో కొందరు కమ్యూనిస్టుపార్టీని రద్దుచేయాలని సిగ్గుశరం లేకుండా కేకలువేసేవారున్నారు. ఆ ప్రముఖులు జపానువారి పంచమాంగదళంగాక మరేమిటి? ఈ నినాదం పూర్వము లేవదీయలేదు; కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రద్దుచేశాక బయలుదేరింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రద్దుతో చైనాకు కమ్యూనిజం పనికిరాదని తేలిపోయిందని, చైనా కమ్యూనిస్టుపార్టీబలం తగ్గిపోయిందని, పార్టీ విచ్ఛిన్నమైపోతోందని వారు నినాదాలు లేవదీశారు. ఈ కూతల్నియెవరైనా నమ్ముతారా?

చైనాకుకమ్యూనిజం పనికిరాదూ? మార్క్సు, లెనిన్‌ల సిద్ధాంతాలు మానవ సమాజానికంతకు పనికివస్తే చైనాకెందుకు పనికిరావు? కమ్యూనిస్టులు మార్క్సిస్టు విజ్ఞానంతో, ప్రజావ్యతిరేకులైన పంచమాంగదళంవారి చేష్టలను బహిరంగం చేస్తారన్నభయంతో బాధ్యతలేని కమ్యూనిస్టు వ్యతిరేకులంతా వాగే వాగుడుమాత్రమే. చైనాప్రజలకు, వారి సాంఘిక, ఆర్థిక, రాజకీయ విధానంలో అవసరమైన విప్లవమార్పులను గుర్తింపచేస్తామని హడలెత్తిపోయిన కమ్యూనిస్టు వ్యతిరేకులంతా ఇలా వాపోతున్నారు.

చైనాకు కమ్యూనిజం ఉపయోగకరం. అంతేగాదు. గత కొన్ని సంవత్సరాల అనుభవంవల్ల, చైనాప్రజల స్వాతంత్రయుద్ధంలో కమ్యూనిజమ్ ఒక భాగమైపోయింది. చైనాప్రజల ప్రయోజనాలు సాధించుటకు ప్రజల్లో నాటుకుపోయింది. దీన్ని నాశనం చేయాలనేవారు మాత్రమే నాశనమైపోతారు

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రద్దు అయితే చైనా కమ్యూనిస్టుపార్టీ బలం పోయిందా? చైనాకమ్యూనిస్టుపార్టీ స్థాపన, అభివృద్ధి సందర్భాల్లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యొక్క అమూల్యమైన సలహాలు, సహాయం పొందినమాట యదార్థమే. అయితే చైనాకమ్యూనిస్టుపార్టీకి పునాది, అండ చైనాప్రజలేగాని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ గాదు.

చైనాకమ్యూనిస్టుపార్టీ కష్టజీవులయిన చైనాప్రజల్లో పుట్టి పెరుగుతోంది. మనపార్టీ ప్రజలపార్టీ. మన పార్టీలోనేడు 8 లక్షలమంది సభ్యులున్నారు. 5 లక్షలమంది సైనికులున్నారు: 10 కోట్ల ప్రజానీకంతో పెనవేసికొని శత్రువుపై పోరాడుతోంది. చైనాజాతికి కమ్యూనిస్టుపార్టీ అవసరం. చైనాప్రజలు కావాలని కోరుతున్నారు. దాన్ని రద్దుచేయడ మెవరి తరం? కమ్యూనిస్టుపార్టీ రద్దుగాదు సరిగదా, శాశ్వతంగా ఉంటుందని కమ్యూనిస్టు వ్యతిరేకులకు మనం విశదం చేయాలి. ప్రపంచ ఫాసిస్టు వినాశనం సమీపిస్తోంది. ఈసమయంలో నాశనం కావాల్సింది, రద్దుగావల్సింది చైనాకమ్యూనిస్టుపార్టీగాదు. చైనా ఫాసిస్టురహస్య పోలీసు శాఖమాత్రమే.

చైనా కమ్యూనిస్టుపార్టీలో అంతఃకలహాలు పుట్టాయా? కమ్యూనిస్టు వ్యతిరేకులు వారి పార్టీలలోవలె మన కమ్యూనిస్టుపార్టీలో గూడ ముఠాలు, చీలికలు ఉంటాయని రాత్రింబవళ్లు కలలుగంటారు. ఆరీతిగ కథలు కల్పించి మనపార్టీపై దుష్ప్రచారం చేస్తుంటారు. మనపార్టీ వర్గ చైతన్యం గల్గి, విప్లవసిద్ధాంతాలతో, కమ్యూనిస్టు ఆశయాలుగల్గి, గట్టి శిక్షణపొంది ఐక్యమయి ఉంగని వారికి తెలియదు. దాని ఐకమత్యాన్ని కాపాడే వాలంటీరు శిక్షణ ఉంది. కమ్యూనిస్టుపార్టీలో ముఠాలు, గ్రూపులు ఉండవు. మనపార్టీ, ఎవరి పెత్తనంకోసరమై వారు ప్రాకులాడే ముఠాలు గల్గిన కోమింటాంగ్ వంటిది గాదని వారికి తెలియదు,

మనపార్టీ లోగడ కొన్నిపొరపాట్లు చేసినమాట నిజమే. చాలమంది పొరపాట్లు చేసినవారు మనపార్టీలో ఉన్నమాట గూడ నిజమే. కొందరు

ఒకటి చెల్లగా ఒకటి ఎప్పుడూ తప్పులు చేస్తుంటారు. సరిదిద్దుకొనుటకు ఇష్టపడరు. వారిని పార్టీ అసహ్యించుకొంటుంది; పార్టీనుండి బహిష్కరిస్తుంది. చెన్-షు-సెన్, చాంకో-షో లిద్దరు పార్టీ నిర్మించిన పితామహుల్లోనివారు గారూ? తప్పులుచేసి, సరిదిద్దుకో నిష్టపడక, వాటినే అంటి పెట్టుకొన్నందుకు వారు పార్టీనుండి తొలగించివేయబడ్డారు. వారు పార్టీలో చీలికలు తేలేకపోయారు. పైపెచ్చు పార్టీ ఐక్యతతో సంఘటితమయింది. గత మూడు సంవత్సరాలుగ మా-జి-డంగ్ నాయకత్వాన మనపార్టీ, కేడరు నంతా పరీక్షించి సరిచేసి, సంపూర్ణంగా సంస్కరించి, ఉక్కుశిక్షణతో సంఘటితమయింది.

కమ్యూనిస్టు వ్యతిరేకుల కందరికీ నేను ముఖ్యంగా చెప్పేదేమంటే మీ దుష్ప్రచారం వలన మా పార్టీ విచ్ఛిన్నంగాదు. మీ కుట్రలను బాగా గుర్తెరిగి ఇంకా జాగ్రత్తగ ఉంటుంది. జపానుతో యుద్ధం జరుగుతున్న ఈ రోజుల్లో అట్టి కుట్రలేమీ పారవనీ, విప్లయిస్థాయి రోజురోజుకు పెరిగి, ముందుకు పోతూందనీ మేము భావిస్తున్నాం. కమ్యూనిస్టుపార్టీ మాత్రం విచ్ఛిన్నంగాదు. అది మరేదైనా అయి ఉండవచ్చు. చరిత్రలో అలాంటివి లోగడ జరిగాయి.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రద్దయిన తర్వాత మన మొక విషయాన్ని స్పష్టంగా గుర్తుంచుకోవాలి. చైనా విప్లవ సమస్యలను పరిష్కరించుటలో చైనా కమ్యూనిస్టుపార్టీని ఇంకా ఎక్కువ స్వతంత్రంగాను, బాధ్యతతోను నడపవలసి ఉంటుంది.

మన ఆఖరి విజయంవరకు జపాను వ్యతిరేక పోరాటాన్ని బలపరుస్తున్నాం. చైనా ప్రజాశక్తితోనే జపాను మూకను మనభూమినుండి తరిమివేయగలమని నమ్ముతున్నాం. వొల్లీవొల్లని పోరాటము, కుట్రలు సాగించుట మూలాన మధ్యలోనే యుద్ధం విఫలమై కాళ్ళారజాపి లొంగిపోయే ప్రమాదం ఉంది. మనం దాన్ని జాగ్రతగా ఎదుర్కోవాలి. మరో ముఖ్య విషయ మేమంటే, మనం గట్టిగ యుద్ధం చేస్తేనేగాని పరులసహాయానికి అర్హతలేదు. యుద్ధవిజయానికి మిత్రమండలితో చేరి పోరాడలేము.

మనం మనఃపూర్వకంగా జాతీయైక్యతను బలపరుస్తున్నాం. అంతర్యుద్ధాన్ని రాకుండా చేయడానికి, సమస్యలు పరిష్కరించుకోడానికి, సర్వవిధాల కొమింటాంగ్‌తో చర్చించడానికి సిద్ధంగా ఉన్నాం. కాని రాయ

బారాలు మాత్రం మర్మము విడిచి నడపాలి. ఉభయపక్షాలు కొన్నిపాయింట్లు వదలుకోవడానికి తయారు గావాలి. ఒకవైపు రాజీ రాయబారాలు, మరొక చెంప మిలిటరీ సంఘటనలు పనికిరావు. ఒకవంక రాజీ అంటూ, మరో వంక కమ్యూనిస్టుపార్టీని రద్దుచేయాలనడం మున్నగు అసందర్భ వ్యవహారాలు పనికిరావు. కమ్యూనిస్టుపార్టీని రద్దుచేసి కొమింటాంగ్‌లో కలిపి వేయాలని, అందుకు అవసరమయిన పశుబలం ఉపయోగించాలని, వారి దృష్టిలో అదే ఐక్యత అని, ఎవరైనా కొందరు కొమింటాంగ్ సభ్యులంటే- అది చాల దురదృష్టసంఘటనయని చెప్పక తప్పదు. దానివలన వాటిల్లేది మారణ అంతర్యుద్ధమేగాని ఐక్యతమాత్రం కాదు.

మనం ప్రజాసామాన్యంయొక్క అభివృద్ధిని కోరుతున్నాం. కొమింటాంగ్ పెద్దలు యిప్పటికైనా వారి దురభిప్రాయాలు వదలి, డాక్టరు సన్ యట్ సేన్ మూడు సూత్రాలను ఆచరణలో పెడతారని ఆశిస్తున్నాం. అన్ని జపాను వ్యతిరేక పార్టీలను ఐక్యపరచి, యుద్ధాన్ని జయించడానికి మనం సిద్ధంగావున్నాం. ఇదే మన పాలసీ.

కామ్రేడ్స్, నేను ముగిస్తూ, మా-జీ-డంగ్ నాయకత్వాన ఈ పాలసీల విజయంకొరకు తుదివరకు పోరాడుతానని శపథం చేస్తున్నాను.



## కొమింటాంగ్ 11 వ విస్తృత సమావేశ సందర్భంలో

# 'లిబరేషన్ డెయిలీ' పత్రిక సంపాదకీయం

(అక్టోబరు 6, 1943)

కొమింటాంగ్ విస్తృత సమావేశం సెప్టెంబరు 6 నుండి 13 వరకు జరిగింది. రెండు రోజుల తదుపరి ప్రజా రాజకీయసభ మూడవ సమావేశం జరిగింది. ఇప్పటికి మాకు ఆ రెండు సమావేశాల వివరాలు లభించాయి. వాటిపై మా అభిప్రాయమిది.

అంతర్జాతీయ పరిస్థితులు నేడొక గొప్పమార్పు చెందుతున్నాయి. ప్రతిచోట ఆ మార్పును గుర్తిస్తున్నాం. ముఖ్యంగా యూరప్ ఫాసిస్టుముఠా ముందు హడావిడిలో పడ్డది. అందుకై హిట్లరు తన సర్వస్వం

సమీకరించి అంతిమ యుద్ధానికి సన్నద్ధుడౌతున్నాడు. ప్రధానంగా సోవియట్ శక్తివల్లనే ఈ మార్పు వచ్చింది. రష్యనులు దీన్ని ఉపయోగించుకొని తిరుగుదాడులు చేసి హిట్లరును నీపర్‌నది దాటగొట్టారు. జర్మను యుద్ధయంత్రాన్ని నడుము విరగగొడుతున్నారు. మరో చలికాల దండయాత్రతో సోవియట్‌భూమినుండి శత్రుమూకలను నిశ్శేషంగా తరిమివేస్తారు.

బ్రిటన్ - అమెరికాలు గూడ ఈ నూతన పరిస్థితులను వినియోగించుకొంటున్నాయి. హిట్లరు కొంచెం పడిపోయే సూచనలు కనపడగానే, జర్మనీపై దండయాత్ర చేయడానికి చర్చిల్ తనశక్తులను సమీకరిస్తున్నాడు. మిత్రమండలి తరఫున ఇటలీరంగంలో 10 డివిజన్లు పోరాడుతున్నా, చర్చిల్ ప్రధాని దాన్ని మూడవరంగంగానే భావిస్తున్నాడు. అంతేగాని అది రెండవరంగం గాదు. యూరప్ సమస్య పరిష్కారమయ్యే అంతిమ ఘడియలు సమీపించాయి. ఈ పరిష్కారానికి ప్రధానశక్తి సోవియట్ రష్యా అని తేలిపోయింది. యూరప్ సమస్య ప్రపంచ రాజకీయాలకు ఆయువుపట్టు. అందుచే యూరప్ సమస్యా పరిష్కార ఫలితాలనుబట్టి ప్రపంచ ఫాసిస్టు - ఫాసిస్టు వ్యతిరేకపక్షాల భవిష్యత్తు నిర్ణయమవుతుంది. జపాను ఫాసిస్టులు, కథ అడ్డం తిరిగిందని గ్రహించి తమ యావచ్ఛక్తిని సమీకరించి అటో ఇటో తేల్చుకో యత్నిస్తున్నారు. — చైనాలో కొమింటాంగ్‌ను చుట్టుముట్టి, అస్త్రసన్యాసం చేయించడానికి, క్రూరంగా కమ్యూనిస్టులను హతమార్చడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు. విప్లవ వ్యతిరేకుల ఆశలు అడుగంటాయి.

కొమింటాంగ్ గూడ ఈ మార్పును గుర్తించింది. అంతర్జాతీయ పరిస్థితులను చూచి ఒకవిధంగా సంతోషాన్ని, మరోవిధంగా భయాన్ని ప్రదర్శిస్తోంది. యూరప్ ఫాసిస్టుల పనిపట్టడం త్వరలో తేలిపోతే ఆంగ్లో-అమెరికను సైన్యాలు తమకు తోడ్పడి త్వరలో జపానును ఓడించగలవని సంతోషిస్తున్నారు. మూడు ఫాసిస్టు రాక్షస రాజ్యాలు పతనమై నూతన ప్రజా ప్రపంచం అమల్లోకి వస్తే, అభివృద్ధి నిరోధకమైన కొమింటాంగ్ ప్రభుత్వం ప్రపంచానికి వెల్లడి అవుతుందని భయపడుతున్నారు. తాము కోరే ఏకనాయకత్వం, ఏకపార్టీ, ఏకసిద్ధాంతం అనే ఫాసిజం, ప్రపంచ ప్రజా తరంగాలతో తుడుచుకపోతుందని జడిసిపోతున్నారు.

నిజం చెప్పాలంటే రష్యాను హిట్లరుపై ఒంటరిగా పోరాడించాలని కొమింటాంగ్ ఉద్దేశ్యం. వీలుంటే జపాన్ను రష్యాపైకి రెచ్చగొట్టి రష్యాను చావుదప్పి కన్ను లొట్టపోవునట్లు నీరసపర్చాలనీ: బ్రిటన్ - అమెరికాలు రెండవరంగం మానేసి జపానుపై కేంద్రీకరించాలనీ: తద్వారా చైనా కమ్యూనిస్టులను నాశనం చేయడానికి తమకు తోడ్పడాలనీ వారి అభిప్రాయం. ఈ దురుద్దేశాలతోనే 'ఆసియా యుద్ధం ముందు' అనే నినాదాన్ని లేవదీశారు. కొన్నాళ్ళ తర్వాత 'యూరప్ - ఆసియారంగాలకు సమాన శ్రద్ధ' అనే నినాదాన్నిచ్చారు. రూజ్‌వెల్టు - చర్చిల్ ప్రధానులు క్విబెక్ సమావేశానంతరం టి. వి. సూంగ్‌ను పిల్చి మాట్లాడేసరికి కొమింటాంగ్ పెద్దలు ఉబ్బితబ్బిబ్బైనారు. క్విబెక్ సమావేశం, అమెరికా - ఇంగ్లండు - చైనాల త్రైరాజ్య సమావేశమనీ, ఆంగ్లో - అమెరికను శక్తులు తమ దృష్టిని ఆసియా రంగానికి మరల్చారనీ, 'యూరప్ ముందు' అనే నినాదం కాలదోషం పట్టిపోయిందనీ చంకలు గొట్టారు.

కాని కొమింటాంగ్ సంతోషం క్షణభంగురమే అయింది. 'ఆసియా ముందు' 'యూరప్ ఆసియాలకు సమానశ్రద్ధ' అనే తమ నినాదాలను గూర్చి కొద్దికాలంలోనే నిరాశచెంది కొంతవరకు మారింది.

కమ్యూనిస్టుపార్టీ శత్రువుపై సాగించే ప్రతిఘటనాయుద్ధాన్ని బలహీనపర్చి దేశాన్ని ప్రమాదంలోకి తెస్తుందని, కొమింటాంగ్ 11 వ విస్తృత సమావేశంలో కమ్యూనిస్టులను తప్పుగా నిందించింది. కొమింటాంగ్ — కమ్యూనిస్టు సమస్యను రాజకీయంగా పరిష్కరించుకోవడం తమ అభిమతమనీ, కాన్స్టిట్యూషనల్ ప్రభుత్వాన్ని నెలకొల్పడంద్వారా సమస్యా పరిష్కారం చేసుకోవాలనీ ప్రకటించారు. కొమింటాంగ్‌చే కీలుబొమ్మగా చేయబడ్డ ప్రజారాజకీయ సభగూడ అదే తీర్మానాలను ప్యాసుచేసింది. ఈ పైఘన కార్యాలతోపాటు జాతీయప్రభుత్వానికి చియాంగ్‌నే అధ్యక్షుడుగ ఎన్నుకొని నిరంకుశ నియంతృత్వాన్ని బలపర్చింది.

## దిగజారుడు పంథా

పై సమావేశానంతరం కొమింటాంగ్ బహుశా యే ప్రయత్నాలు చేయవచ్చు? అనే విషయంపై మా అభిప్రాయంలో మూడు మార్గాలున్నాయి.

(1) జపానుకు పాదాక్రాంతమవడం,

(2) కమ్యూనిస్టు సమస్యా పూర్తి పరిష్కారాన్ని వాయిదా వేయడం,

(3) రాజకీయ పాలసీని మార్చుకోవడం.

కొమింటాంగ్‌లోని పనికిమాలినపందలు ఎల్లప్పుడూ వాగుతున్నట్లే జపానుతో రాజీచేసికొని, కమ్యూనిస్టుల పనిపట్టాలని ప్రేలుతున్నారు. వీరే చియాంగ్‌చుట్టూ మూగి కమ్యూనిస్టులతో కయ్యానికి రెచ్చగొడుతున్నారు. చైనాలో అంతర్యుద్ధం వస్తే జపానుతో ఓడిపోవడం ఖాయమేననీ, జపానుతో లొంగి రాజీపడాలన్న వారి కోరికలు నెరవేరుతాయనీ వారికి తెలుసు. అందుకే వాయవ్యదిక్కున నాలుగైదులక్షల సైన్యాలను కేంద్రీకరించి ఉంచారు. ఇంకా రహస్యంగా ఇతర రంగాలనుండి ఇచటికి సైన్యాలను పిలిపిస్తున్నారు. ఈసారి కమ్యూనిస్టులపై దండెత్తే సైన్యాధిపతులు, ఆత్మవిశ్వాసంగల ధీశాలులని వార్తలు బయలుదేరాయి. కొమింటాంగ్ సమావేశంలో చియాంగ్-కమ్యూనిస్టు సమస్యపై రిపోర్టు ముగించగానే, యీనాన్ జయించడం లెక్కాపత్రిమా అంటూ, అదొక సమస్యా అంటూ ఈ సైన్యాధిపతులు చిటికెలువేశారు. చియాంగ్ సూచనపై సమస్యను రాజకీయంగా పరిష్కారం చేయాలని తీర్మానించారు.

పదొవ సమావేశంలోగూడ ఇట్టి రాజకీయ పరిష్కార తీర్మానమే చేసినట్టు మాకు జ్ఞాపకం. కాని వెంటనే బోర్డర్ ప్రాంతాన్ని హతమార్చుటకు ఒక మిలిటరీ ప్లాను తయారుచేయమని, మిలిటరీ నిపుణులకు ఆజ్ఞాపించారు. జూన్, జులై మాసాల్లో బోర్డర్ ప్రభుత్వంపై ఒక మెరుపు దాడికి ప్రయత్నించారు. జాతీయ, అంతర్జాతీయ ఒత్తిడి ఫలితంగా ఆ ప్రయత్నం విలిపివేయబడింది.

మరల నేడుగూడ అటు తీర్మానం చేసిచేయకముందే ఇటు కొమింటాంగ్ మిలిటరీ నాయకులు ప్రగల్భాలు సాగించారు. త్వరత్వరగా యీ రంగానికి సైన్యాన్ని దిగుమతిచేస్తున్నారు. 'యీనాన్'ను జయించడం ఒక్క లెక్కగాదు అన్నమాటల్లో భావమేమిటి? నిస్సందేహంగా జపానుకు లొంగిపోవడానికేనని తేలిపోతూంది.

# కొన్ని హెచ్చరికలు

అంతర్యుద్ధాన్ని బలపర్చే కొమింటాంగ్ సభ్యులందరూ, జపానుకు లొంగిపోవడానికి బుద్ధిపూర్వకంగా వప్పుకోరు. అంతమట్టుకు సందేహం లేదు. వారిలో కొందరు ఇటు కమ్యూనిస్టులపైన, అటు జపానుమీద ఏక్దమ్మున యుద్ధం చేయగలమని నమ్ముతున్నారు. వామ్‌ఫో మిలిటరీవేత్తలు యెక్కువమంది అలా భావించవచ్చు. కాని ఈ పెద్దలను మేము కొన్ని ప్రశ్నల వడగాలసి ఉంది.

మీరు పది సంవత్సరాల అంతర్యుద్ధ ఫలితాలను పూర్తిగ మరచి పోయారా ? అంతర్యుద్ధం ప్రారంభమవడంతోనే, జపాను కీలుబొమ్మ వాంగ్-చింగ్-లే, కొమింటాంగ్‌లోని పిరికివాళ్ళు మీ ప్రతిఘటనను నీరస పర్చి, ముందుకు సాగనీయరని మీరు గ్రహించారా ? ఏకకాలంలో రెండు రంగాల్లో యుద్ధంచేయడానికి మీకున్నశక్తి యెంత ? పేరుకు 30 లక్షల సైన్యమేగాని వారంతా విస్ఫృహతో నడుములు విరిగి ఉన్న రకం.

ప్రజలు మీ సైన్యాలను కోడిగుడ్లబుట్టతోపోల్చి సామెతలు చెప్పు కొంటారు. ఒక్క సంఘటనతో పప్పు పప్పు అయిపోతారు. ఈ సంగతి చంగ్షోరేంజి, టెయిహాంగ్‌రేంజి, టాపేరేంజి మున్నగు అనేక యుద్ధాలలో రుజువయిపోయింది. పై చెప్పిన ఉదాహరణ యదార్థం. కారణమేమంటే మీరు ఒకవైపు 'తీవ్ర కమ్యూనిస్టువ్యతిరేకత', మరోవైపు నీరసపుజపాను వ్యతిరేక పోరాటము అనే రెండు వినాశకర విధానాలను ఆచరిస్తున్నారు. మన విద్రోహ శత్రువు (వాంగ్-చింగ్-లే) మన భూభాగంలోకి చొరబడి వచ్చేకొలది మీసైన్యాలు మరింత జారిపోతాయి. మీసైన్యాలు గర్భశత్రువైన జపానుమీదచేసే పోరాటమే నీళ్ళునమలినట్లుంటే, కమ్యూనిస్టులమీద, ప్రజలమీద ఇంకెంతబాగా పోరాడుతాయి ? యథార్థంగా అది అసంభవం. అంతర్యుద్ధానికి మీరు మొదటి తుపాకిపేల్చిన మరుక్షణంనుండి మీ సర్వ సైన్యాలు అందులోనే నిమగ్నం గావలసివస్తుంది. మీరు నేడు సాగించే నామమాత్ర ప్రతిఘటనగూడ మానేసి జపానుకు దాసోహమని లొంగిపో వలసివస్తుంది. మీరు ఆ పంథానే అవలంబించితే లొంగిపోవడం తప్పని సరి అవుతుంది.

జపానుకు లొంగడం సహించని కొమింటాంగు సభ్యులందరిని మేము హెచ్చరించేదేమంటే మీరు అంతర్యుద్ధమేప్రారంభిస్తే గత్యంతరం

లేక జపానుకు లొంగుబాటుదార్లుగ కావలసివస్తుంది. గత రెండు కొమింటాంగ్ సమావేశాల్లోను మీరుచేసిన తీర్మానాలను చాటుచేసికొని మిలిటరీ సన్నాహాలు చేసికుంటూ ప్రజాభిప్రాయాన్ని సానుకూలం చేసుకోజూస్తున్నారు. మీరు లొంగుబాటగాళ్ళ తల తిరుగుడు సలహాలు విని వెర్రెత్తి అంతర్యుద్ధానికే దిగితే జపాను శతృవుకు లొంగిపోవడం తప్పదు. తప్పటడుగు వేస్తే, మీ కిష్టమైనా కాకపోయినా పట్టేదుర్గతి అదేనని మీరు గ్రహించండి.

కొమింటాంగ్ పదకొండవ సమావేశానంతరం అవలంబించే పాలసీల్లో మొదటిదయితే పర్యవసానంపైన చెప్పినదే. మనమిప్పుడొక మహా క్లిష్టతర విపత్తును యెదుర్కొంటున్నాం. 'రాజకీయ పరిష్కారం' 'పరిపాలన మార్పులద్వారా పరిష్కార ప్రయత్నాలు' అంటూచేసిన తీర్మానాలు అంతర్యుద్ధానికి, జపానుతో ఓటమికి ముసుగులు మాత్రమేనని గ్రహించాలి:

కమ్యూనిస్టు లందరు, దేశభక్తులైన కొమింటాంగ్‌సభ్యులు, జపాను వ్యతిరేక పార్టీలు, సోదర దేశభక్తులు తప్పక మేల్కొని, ఈ విషయాలను గుర్తించాలి. లొంగుబాటుగాళ్లు వేసే జిత్తులకు యెవరూ మోసపోరాదు. పదకొండవ కొమింటాంగ్ విస్తృతసమావేశంతర్వాత చైనాలో అంతర్యుద్ధ ప్రమాదం, మునుపటికంటె హెచ్చయిందని వారంత గమనించాలి.

## మోసగాళ్ళ పంథా

కొమింటాంగ్ ప్లీనరీ సమావేశ, ప్రజా రాజకీయసభల తీర్మానాలు మరోవిధంగా పరిణమించవచ్చు. భవిష్యత్‌లో ఒక కమ్యూనిస్టు వ్యతిరేక దాడికి తయారవుతూ తాత్కాలికంగా ఆ విషయాన్ని ఆపివేయవచ్చు. ఇది లొంగుబాటుగాళ్ళ పంథాతో కొంత భేదిస్తుంది. వీరు జపాను వ్యతిరేక ప్రతిఘటన సాగించాలంటారు. కాని కమ్యూనిస్టు వ్యతిరేక నియంతృత్వం గూడ నిర్మించాలంటారు.

వీరు ప్రపంచంలో వచ్చే మార్పును గుర్తిస్తున్నారు జపాను సామ్రాజ్యవాదుల నాశనము, అంతర్యుద్ధానికి జపానుతో ఓటమికి గల సంబంధాన్ని గ్రహించారు. అంతర్యుద్ధమంటే ప్రజలు వ్యతిరేకించుట, జపాను వ్యతిరేక పోరాటానికి ప్రజామోదము జూస్తున్నారు. కొమింటాంగ్ ప్రజల విశ్వాసాన్ని కోలుపోతున్నదని, ప్రజలనుండి వేరువడి

పోతూందని తెలుసుకొన్నారు. ప్రస్తుత క్లిష్టపరిస్థితులు, మిత్రమండలి అంతర్యుద్ధాన్ని వ్యతిరేకించుటచూచి, ఈ సమస్యను వాయిదావేసి, కొన్ని సాకులు చెపుతున్నారు.

ఈ రకం ప్రముఖులు ఆరితేరిన మోసగాళ్ళు. కాలయాపన చేయ చూస్తున్నారు. యూనాన్‌పై దాడి, కమ్యూనిస్టులను హతమార్చడం మొదలగు విషయాలు వీరు మరచిపోకుండా కలవరిస్తూనే ఉంటారు. ఈ విషయంలో వీరు లొంగుబాటు గాళ్ళకు నకలే. కాని జపాను వ్యతిరేకజండాను దించుటకు అంగీకరించరు. ప్రజలలో కొమింటాంగ్ పలుకుబడి క్షీణించడం వప్పుకోరు. అంతర్జాతీయ ప్రజాభిప్రాయానికి జంకుతారు. అందుకే మరొక అవకాశం వచ్చేవరకు ప్రస్తుతం ఈ సమస్యను వాయిదా వేస్తారు. వీరు ఈ సమస్యను సక్రమ పరిపాలనా పద్ధతులతో, రాజకీయంగా పరిష్కరించగోరే సూచన లేమిలేవు. ఈ క్రింది అంశాలు ఆ విషయాన్ని రుజువు చేస్తాయి.

## చియాంగ్-కె-షేక్ పాతనాటకం

కొమింటాంగ్ పదోవసమావేశానికి పదిరోజుల ముందో వెనకనో, చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ లిన్-పి-వోను చియాంగ్‌తో కలుసుకోమని పంపించింది. లిన్-పి-వో పదినెలల తరబడి ఉన్నా చియాంగ్‌గాని, కొమింటాంగ్ కేంద్ర కార్యవర్గంగాని ప్రస్తుత క్లిష్టసమస్యలను చర్చించకుండా మొగం దాటవేశారు. ఫలితం శూన్యం. తదుపరి ఈ సంవత్సరం మార్చినెలలో చియాంగ్ 'చైనా భవిష్యత్' అనే గ్రంథాన్ని ప్రకటించాడు. అందులో కమ్యూనిజాన్ని, లిబరలిజాన్ని దూయబట్టాడు. పదిసంవత్సరాల అంతర్యుద్ధానికి కారణం కమ్యూనిస్టులపై రుద్దాడు. చైనా కమూనిస్టు పార్టీని, ఎనిమిదవ, కొత్త నాల్గవసైన్యాల్ని ఖండించాడు. వారిని 'నూతన సైనికులని' 'నూతన విభాగులని' హేళనచేశాడు. రెండు సంవత్సరాలలో కమ్యూనిస్టులను హతమార్చుతానని సూచించాడు. మరల ఈ సంవత్సరం చూ-ఎన్-లే, లిన్-పి-వోలను యూనాన్‌కు తిరిగి పోనిచ్చి వారి వెనుకనే, తన సైనికాధిపతులకు, యెల్లో నదివద్ద పోరాడే సైన్యాన్నంతా బోర్డర్ రిజియన్ చుట్టూ కేంద్రీకరించమని ఆజ్ఞాపించాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రద్దుచేశారనే సాకుతీసికొని, చైనా కమూనిస్టుపార్టీని గూడా రద్దు చేయాలని తన చెప్పుచేతల్లోని ప్రజాసంస్థలచే ఆందోళన చేయించాడు.

చైనా దేశరక్షణను, జపాను వ్యతిరేకప్రతిఘటనను కోరే మేము ఈ దుస్సహపరిస్థితుల్లో, ఇలాంటి కుట్రలనన్నిటిని బట్టబయలు చేస్తూ ప్రజలకు విజ్ఞప్తి చేయకతప్పదు. మేము సాధ్యమైనంతవరకు ఓర్పుగల్గి, సహనంగా ఉన్నామని తెలుపుటకు ఈ క్రిందివే చక్కని నిదర్శనాలు.

హాంకో పతనమయిన నాటినుండి నేటివరకు ఉత్తర, మధ్య చైనాలోని కమ్యూనిస్టు శక్తులమీద కొమింటాంగ్ దాడులు చేస్తూనే ఉన్నది. జపాను పసిఫిక్‌యుద్ధం సాగిస్తున్న రెండేళ్ళు కొమింటాంగ్ కమ్యూనిస్టులపై దాడి చేస్తూనే ఉంది.

కియాంగ్సు, షాంటంగ్ ప్రాంతాల్లోని కమ్యూనిస్టులను హతమార్చుటకు వాంగ్-చంగ్-లాన్, లి-షెన్-చో ల నాయకత్వాన సైన్యాలను పంపారు. పాంపింగ్‌షెన్ సైనికదళాన్ని, యాన్వి, హూపే ప్రాంతాల సైనికముఠాలను గూడ కమ్యూనిస్టులపైకి పంపారు.

ఈ దాడుల నన్నిటిని ప్రజలకు తెలియపర్చకుండా మేము సహించి ఊరుకున్నాం. కొమింటాంగ్ మాపై దుమ్మెత్తిపోస్తూ, పరాభవంచేస్తూ సంవత్సరాల తరబడి ప్రచారంచేసింది. కొమింటాంగ్ రహస్య పోలీసు శాఖ వేలకొలది కమ్యూనిస్టుపార్టీ సభ్యులను, పార్టీయేతర యువకులను అరెస్టుచేసింది; అవమానం చేసింది; చంపింది. మేమదంతా దిగమ్రింగాం. కొమింటాంగ్, అక్రమంగా కొత్త నాల్గవసైన్యానికి చెందిన, ధైర్యసాహసాలుగల తొమ్మిదివేలమందిని నిరాయుధులుచేసింది. దానికి కమాండరుగనున్న యేటింగ్‌ను అరెస్టుచేసింది. ఉపకమాండరుగనున్న హాన్-ఇంగ్‌ను ఖూనీచేసింది, ఇంకా వందలకొలదిని నిర్బంధించింది. ఇది సహచరునిపై, ప్రజలపై, దేశంపై చేసిన దుర్బర క్రిమినల్‌దాడి. ఇందుకు మా నిరసన మాత్రం తెలుపుతూ, విచారించి పరిష్కరించమన్నాం. సహించి ఊరుకొన్నాం.

## జపానుకు వంతనాటకం

షెన్సు-కన్సు-నింగ్‌షా బోర్డర్ రిజియన్ కథ మరొకటి ఉంది. కులింగ్‌లో మా ప్రతినిధి చియాంగ్‌తో కలసి సంప్రదింపులతోనే బోర్డర్ రిజియన్ 1937 లో నిర్మించబడింది. దానికి ఉద్యోగస్థులు ప్రభుత్వంచే నియమింపబడ్డారు. నేడు చియాంగ్ తనమాటలనే తాను ఉల్లంఘించి ఆప్రదేశాన్ని ఆర్థిక, మిలటరీ బ్లాకేడులమలుపర్చి ఐదులక్షల సైన్యాన్ని నియమిం

చాడు. ఆ ప్రదేశ ప్రజలను, ఎనిమిదవ సైన్య ఆఫీసర్లను సంహరిస్తే తప్ప నిద్రపోయేటట్లు లేదు. ఎనిమిదవ సైన్యానికి సప్లయిలన్నీ అరికట్టాడు. కమ్యూనిస్టుపార్టీని 'దేశద్రోహపార్టీ' అని, కొత్త నాల్గవ, ఎనిమిది సైన్యాలను 'విద్రోహ' 'దేశద్రోహ' సైన్యాలని పేర్లతో పిలుస్తున్నాడు. ఈ సంగతులు ప్రపంచానికంతకు విశదమే అయినా ఇక్కడ పేర్కొవలసి వచ్చింది.

కొద్దిలో చెప్పాలంటే, కొమింటాంగుకు కమ్యూనిస్టులే జపాను కంటేవందలవేలరెట్లు శత్రువులుగా కన్పిస్తున్నారు. జపాన్‌గూడ కొమింటాంగ్‌పై క్రమంగా విరోధంమాని, కమ్యూనిస్టులపై జోరుచేస్తోంది. జపాన్ ఇదివరకు 'కమ్యూనిస్టులు - కొమింటాంగ్ నశించాలి' అని నినాదాలిచ్చేవారు. నేడు కొమింటాంగ్ అనే శబ్దాన్ని విడిచిపెడుతున్నారు. జపాను గాని, దాని ఏజెంటు వాంగ్‌చింగ్ వేగాని, 'కొమింటాంగ్ నశించాలి' 'చియాంగ్ నశించాలి' అనే నినాదాలీయడం మీ రెక్కడయినా ప్రస్తుతం విన్నారా ? మనమెక్కడా ఆ నినాదాలు వినడంలేదు.

జపాను తన సైన్యాల్లో సగానికి పైగా (52%) కమ్యూనిస్టులపై యుద్ధానికి వినియోగిస్తోంది. తక్కువసైన్యాలు కొమింటాంగ్ సైన్యాలకు కాపలాకాస్తూ కూర్చున్నారు. చికియాంగ్, హూపేరాష్ట్రాలనుండి తన సైన్యాలను తగ్గించి చైనాను లొంగిపోవ భ్రమపెడుతోంది. లొంగిపొమ్మనే మాట కమ్యూనిస్టులకుచెప్పడానికి జపానుకు దమ్ములులేవు. కొమింటాంగ్‌కు మాత్రం అలాంటి హెచ్చరికలు, సూచనలు ఆదేపనిగా చేస్తోంది. కొమింటాంగ్ ప్రముఖులు ప్రజలంటేనూ, కమ్యూనిస్టులంటేనూ, పండ్లు నూరుతారు. జపానుమీదమాత్రం ఆ కక్ష మాయమవుతోంది.

కొమింటాంగ్ యుద్ధచర్యలలో తీవ్రత తగ్గించడమే గాకుండా, 'లొంగిపొమ్మని' 'రాజీ చేసుకొమని' జపానుచేసే అవమానకర ప్రచారానికి వ్యతిరేక ప్రచారంగూడా తగ్గించింది. 'చైనాభవిష్యత్తు'లో 'చియాంగ్ సూచించినపంథా పొరపాటు'అని జపాను వ్యాఖ్యానం చేసింది. జపానీయుల, యదార్థమైన, అవమానకరమైన ఈ వ్యాఖ్యానానికి, చియాంగ్‌గాని, అతని అనుచరులుగాని అసమ్మతి తెలిపారా ? ఖండించారా ? లేదు. అందుకు ధైర్యం చేయరు. ఇట్లయితే జపాను కొమింటాగ్‌ను ఎందుకు చౌక చేయదు ? కొమింటాంగ్ వారి శిక్షణ, డిక్రీలు, ఆర్డర్లు కమ్యూనిస్టులపై

మాత్రం చలాయిస్తారు. 20 మంది కొమింటాంగ్ కేంద్ర కార్యవర్గ సభ్యులు, 58 మంది మిలటరీ జనరల్సు శత్రుపక్షానికి పారిపోతే జపాను చులకనచేయదూ ?

భిడియం లేకుండా ప్రపంచంలోని మిత్రదేశాలఎదుట, ప్రజలయెదుట కొమింటాంగ్ కొత్త నాల్గవసైన్యాన్ని నిరాయుధులుగా చేసింది. ఎనిమిదవ సైన్యంపై దాడిచేసింది. బోర్డర్ రిజియన్ను ఆర్థిక మిలటరీ దిగ్బంధం చేసింది. ఎన్నో పేర్లుపెట్టి దుమ్మెత్తిపోస్తూంది. 'శిక్షణ' 'కొత్తఆర్డర్' అంటూ వాపోయింది. శత్రుపక్షానికి పారిపోయిన 20 మంది కొమింటాంగ్ నాయకులనుగూర్చి, 58 మంది జనరల్సునుగూర్చి పల్లెత్తిమాట్లాడ సాహ సించదు. కాని పదకొండవ ప్లీనరీ సమావేశంలో సహితం కమ్యూనిస్టు వ్యతిరేక తీర్మానాలేగాని, లొంగుబాటుగాళ్ళను గూర్చి నోరు మెదపలేదు. కొమింటాంగ్‌వారి యీ వైఖరినిచూచి ప్రపంచదేశాలు, మనప్రజలు ఏమను కొంటారు.

నిజంగా కొమింటాంగ్ కమ్యూనిస్టు సమస్యను రాజకీయంగా పరిష్కరించితే అందుకు మేము సంసిద్ధం. కాని ఇటీవలి దాని రాజకీయాలు ఆచరణచూస్తే అది అంతర్యుద్ధానికి తయారవుతోందని, తీర్మానాలన్నీ ఒక ముసుగు అని తేలుతూఉంది. నికార్సయిన నియంతృత్వ స్థాపనకు ప్రయత్నిస్తోంది.

## బయటపడే మార్గం

జాతీయ పురోభివృద్ధికి మరోమార్గం ఉందా ? ఉంది. అదే కొందరు కొమింటాంగ్ సభ్యులు, ప్రజలందరు, కమ్యూనిస్టులు ఆశిస్తున్నారు. ఆ పాలసీ ఈ క్రింది విధంగా ఉంటుంది.

(1) కొమింటాంగ్-కమ్యూనిస్టు సమస్య న్యాయసమ్మతంగా, రాజ కీయ పరిస్థితులతో పరిష్కరించుట.

(2) ఏకపార్టీ, ఏకసిద్ధాంతం. ఏకనాయకత్వం, అనే ఫాసిస్టు నినా దాలను విడిచిపెట్టి ప్రజాప్రభుత్వ పద్ధతుల నమలుపర్చుట.

(3) యదార్థమైన ప్రజా ప్రతినిధిగ ఉండే జాతీయ మహాసభను సమావేశపర్చుట.

కమ్యూనిస్టులం మొదటినుండి తుదివరకు ఈ పాలసీని బలపరు స్తున్నాం. కొమింటాంగ్‌లోని కొంతభాగం గూడ దీన్ని ఆమోదిస్తారని

తలుస్తాం. గతసంవత్సరాల్లో, చియాంగ్ అతని అనుచరులు ఈమార్గమునే అనుసరిస్తారని ఆశించాం. పూర్వచరిత్రనుబట్టి, నేడు జరుగుతున్న ఘటనల బట్టి, చియాంగ్‌గాని, కొమింటాంగ్ గాని ఈ ధోరణిలో లేనట్లు మాకు కనుపిస్తోంది.

అట్టిపాలసీని ఆచరించాలంటే మనం జాతీయ అంతర్జాతీయ పరిస్థితులపై ఆధారపడాలి. యూరప్ ఫాసిస్టులు దెబ్బతినడంతో అంతర్జాతీయంగా చైనాప్రతిఘటనకు అనుకూలపరిస్థితులొచ్చాయి. అందుకే జపాను, దాని ఏజంటు వాంగ్-చింగ్-వే, కొమింటాంగ్‌లోని ‘ లొంగుబాటుగాళ్లు ’ అంతర్యుద్ధాన్ని పురిగొల్పాలని, వారి ఆశయసిద్ధిని సమకూర్చుకోవాలని తొందరపడుతున్నారు.

వాంగ్-చింగ్-వే ఈమధ్య ఏమన్నాడో చూడండి. ‘ ప్రియసోదరులెట్లయినా ప్రియసోదరులే. చుంకింగ్, మా మార్గాన్నే తప్పక నడుస్తుంది. కాని అనవసరంగా కాలం వృథాచేయక త్వరలో చేయమని కోర్తాను.’ (1 అక్టోబరు 1943) వాంగ్-చింగ్-వే మాటలు ఎంత స్నేహపూర్వకంగా, ఆప్యాయంగా, ఆదుర్దాసూచకంగా ఉన్నాయి ! దీన్నిబట్టి కొంత ఆలస్యం మాత్రమే గాని లొంగిపోవడం జరుగుతుందని కన్పిస్తోంది. అయితే కమ్యూనిస్టులపై మాత్రం ఎప్పుడో మెరుపుయుద్ధం ప్రారంభమవడంలో ఆశ్చర్యంలేదు. నేడు అన్నిపార్టీలు, అందరుదేశభక్తులు, సర్వప్రజానీకం పూనుకొంటే తప్ప సరయినపాలసీ ఆచరణలోకి వచ్చేటట్లు మాకు కనపడటంలేదు.

## హద్దులేని అబద్ధాలు

చైనా కమ్యూనిస్టుపార్టీ, కొమింటాంగ్ సైన్యాలమీద చేసే దాడిని అరికట్టాలనీ, వారు గావించే మిలటరీవిభజన ఆపివేయాలనీ, వారు యుద్ధ ప్రతిఘటనను నీరసపర్చుట మానివేయాలనీ, 1937 లో వారు చేసిన నాల్గు పాయింట్ల వాగ్దానాలు చెల్లించాలనీ చైనాప్రభుత్వం కోరుతూంది. ఈవిషయాన్ని ముందు స్పష్టంచేయాలంటూ, చియాంగ్ పదకొండవ విస్తృత సమావేశంలో ప్రకటించాడు. ఇచ్చట, చియాంగ్ పక్షపాతబుద్ధితో, దుర్మార్గంగా, కమ్యూనిస్టులు కొమింటాంగ్‌పై దాడి చేస్తున్నారనీ, ప్రతిఘటన నాశనంచేస్తున్నారనీ అక్రమనింద వేశాడు. నిజానికి ఇవన్నీ కొమింటాంగ్ చేసే తప్పుడుచర్యలు.

ఈవిధంగా చెప్పడానికి మాకు తగినన్ని ఆధారాలున్నాయి. కొమింటాంగ్ ప్రభువులు హాంకో పతనానంతరం మూడు కమ్యూనిస్టువ్యతిరేక సంక్షోభాలు తెచ్చిపెట్టారు. ప్రతిఒక్క సంక్షోభంలోను యదార్థంగా కొమింటాంగ్, కమ్యూనిస్టులపై దాడివెడలింది.

మొట్టమొదటివాడి 1939 చలికాలంలోను, 1940 వసంతరుతువులోనూ చేశారు. కొమింటాంగ్ సైన్యాలు షెన్సీ-కన్సూ-నింగ్‌షా బోర్డర్ ప్రదేశంలో 5 పట్టణాలను పట్టుకొన్నాయి. ఎనిమిదవ సైన్యంయొక్క నివాసస్థలాన్ని ఆక్రమించారు. పెయిహాంగ్ రేంజిలో ఉన్న ఎనిమిదవ సైన్యంపై చూ-హా-పింగ్ నాయకత్వాన దాడి వెడలారు. విమానాలు గూడ ఉపయోగించారు. ఎనిమిదవసైన్యం ఆత్మరక్షణకు మాత్రమే పోరాడింది.

రెండవపర్యాయం, 1941 జనవరిలో కొత్త నాల్గవసైన్యంపై దాడిచేసి నిరాయుధులుగచేశారు. హోయింగ్‌చిన్, పెయిచుంగ్‌హేలకు-అష్టమ సైన్యాధిపతులయిన చూటే వగైరాలకు టెలిగ్రాములతో కథప్రారంభమైంది. ఎనిమిదవసైన్యం, కొత్త నాల్గవసైన్యం యెల్లోనదికి దక్షిణంగా ఉన్నాయి. నెలలోగా ఉత్తరపువొడ్డుకు మారాలని ఆజ్ఞాపించారు.

దక్షిణయాన్విలోని మా సైన్యాలను ఆర్డర్లుప్రకారం నెలలోగా మార్చుతామని, తక్కినప్రాంతాల్లోని సైన్యాలు జపానుచే చుట్టుముట్టబడియున్న కారణంతో నెలలోపుగ కదల్చలేమని సమాధానంచెప్పాం. ప్రస్తుత పోరాటమయిన తర్వాత మీ ఆజ్ఞలప్రకారం సైన్యాలను నదికి ఉత్తర వైపుకు తెస్తామని చెప్పుకున్నాం. కాని బయలుదేరివస్తున్న త్రోవలోనే మా సైన్యాలలో 9 వేల మందిని 1941 జనవరి 5 వ తేదీ సమూలంగా నాశనంచేయమని చియాంగ్ తన సైన్యాధికారులకు తాఖీదులు పంపాడు. జనవరి 6 నుండి 14 వరకు జరిగిన యుద్ధంలో కొత్త నాల్గవసైన్యంలో ఒకభాగాన్ని నాశనంచేశారు. వెంటనే జనవరి 17 వ తేదీన చియాంగ్ మరొక ఆర్డరు జారీచేశాడు. కొత్త నాల్గవసైన్యాన్ని రద్దుచేయమని, దాని కమాండరుగ ఉన్న యేటింగ్‌ను మిలటరీకోర్టులో విచారణచేయమని ఫర్మానా. ఆనాటినుండి ఎక్కడెక్కడ, కమ్యూనిస్టు - కొమింటాంగు ఉభయసైన్యాలున్నాయో అక్కడల్లా కమ్యూనిస్టులపై దాడిజరిగింది. మేము కేవలం ఆత్మరక్షణకు మాత్రమే పోరాడాము.

మూడవసంఘటన 1943 మార్చినుండి నేటివరకు జరుగుతోంది. కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా, చియాంగ్ 'చైనా భవిష్యత్' అనే పుస్తక మొకటి ప్రచురించాడు. నదిని సంరక్షిస్తున్న కొమింటాంగ్ సైన్యాలను బోర్డర్ రిజియన్ను చుట్టుముట్టమని ఆజ్ఞాపించాడు. మెరుపుయుద్ధ దాడికి సన్నాహాలు ప్రారంభించాడు. ప్రజారాజకీయసభను తన కీలుబొమ్మగాచేసి కొని దానిచే హోయింగ్‌చిన్ వేసిన మిలటరీప్లానును బలపరిపించాడు. కమ్యూనిస్టుపార్టీని రద్దుచేయాలని ఆందోళనచేయించాడు. ప్రజారాజకీయ సభ నుండి కామ్రేడ్ టుంగుపిపూ అసమ్మతిని ప్రకటించి బయటకు రావలసివచ్చింది.

అసలు రహస్యమేమంటే పైమూడు కమ్యూనిస్టువ్యతిరేక సంఘర్షణలు ఒక ప్లానుప్రకారం జరిపినవని, కొమింటాంగ్ పూర్తి తయారుతో జరిపిందని తెలుతూంది. 'జపానువ్యతిరేక ప్రతిఘటనను నాశనం చేయడ'మంటే ఇదిగాక మరేమిటి ?

## చైనాకమ్యూనిస్టులు - మాటకు కట్టుబడిఉన్నారు

1937 సెప్టెంబరు 22 న చైనా కమ్యూనిస్టుపార్టీ ఒక చారిత్రాత్మక ప్రకటననుచేసింది. చైనానుప్రమాదంనుండిరక్షించడానికి, కొమింటాంగ్‌తో సహకారానికి సంసిద్ధమని తెలియజేసింది. ఆ ప్రకటనలో నొకభాగాన్ని ఇక్కడ వివరిస్తాం.

'శతృవు చేసే దుష్ప్రచారాన్ని అరికట్టడానికి, కొందరు పడే అపోహలను తొలగించడానికి, చైనాకమ్యూనిస్టుల జాతీయ స్వాతంత్ర్య పట్టుదలను తెలియపర్చడానికి ప్రజలకందరికి మేమొకప్రకటన చేస్తున్నాం.

(1) డాక్టర్ సన్యట్‌సేన్ యొక్క మూడుసూత్రాలు చైనాకు ప్రాణంలాంటివి. వాటిని అమలుపర్చుటకు మాపార్టీ తన సర్వశక్తిని వినియోగిస్తుంది.

(2) మేము ఇదివరకవలంబించిన మిలటరీ వ్యతిరేకత, సోవియట్ల స్థాపన, కొమింటాంగ్‌ను పడద్రోయ ప్రయత్నం, భూస్వాముల భూములను వశపర్చుకోవడం మున్నగు పాలసీలను విడిచిపెడతాం.

(3) మేము ప్రస్తుతమమల్లో ఉన్న సోవియట్ ప్రభుత్వాన్ని రద్దు చేసి ప్రజాప్రభుత్వ రాజకీయాల్ని అమల్లోబెట్టి, చైనా జాతీయైక్యతకు కృషిచేస్తాం.

(4) రెడ్ఆర్మీయొక్క పేరును, హోదాలను తీసివేస్తాం. జాతీయ విప్లవసైన్యంగా పునర్నిర్మాణం చేస్తాం. జాతీయప్రభుత్వ మిలటరీకౌన్సిలు అధీనంలో ఉంచుతాం. జపాను వ్యతిరేకయుద్ధంలో మిలటరీకౌన్సిలు ఆజ్ఞలప్రకారమే పోరాడుతాం.

పై నాల్గువాగ్దానాలను మేము పూర్తిచేశాం. కొమింటాంగ్ నాయకులెవరుగాని, చియాంగ్‌గాని మేము పూర్తిచేయకుండా ఒకటైనా మిగిల్చామని చెప్పజాలరు.

మొదటివిషయ మేమంటే, కమ్యూనిస్టులమైన మేము షెన్సీ-కన్సూ-నింగ్‌షా బోర్డర్ ప్రదేశంలో సన్‌యట్‌సేను మూడు సూత్రాలను ఆచరణలో పెట్టుటకు అవసరమైన పాలసీల నవలంబించాం. ఒక్కటి గూడ ఆ సూత్రాలకు వ్యతిరేకంగాలేదు.

రెండవసంగతేమంటే, కొమింటాంగ్ శతృవుకు లొంగకుండా, జాతీయైక్యతను విచ్ఛిన్నంచేయకుండా, కమ్యూనిస్టువ్యతిరేకయుద్ధం ప్రారంభించకుండా, ఉంటే మా వాగ్దానాలను జవదాటం. కొమింటాంగ్ అధికారాన్ని మిలటరీబలంతో కూలద్రోయం; భూస్వాముల భూములు స్వాధీనపర్చుకోవడం, సోవియట్లు స్థాపించడం మానివేస్తాం; మేము ఈప్రకారమే లోగడ చేశాం; ప్రస్తుతం చేస్తున్నాం; భవిష్యత్తులో చేస్తాం. పైవిషయాలనుల్లంఘించి కొమింటాంగ్ ఏమయినా చేస్తేతప్ప మేము మాటప్రకారం ఎల్లపుడూ నిలబడి ఉంటాం.

మూడవ వాగ్దానం సంగతి చూదాం. సోవియట్‌ప్రభుత్వాన్ని చాలా కాలంక్రిందటే రద్దుచేశాం. దావిస్థానే 3-3-3 నిష్పత్తిలో ప్రజాప్రభుత్వం యేర్పర్చాం; కొమింటాంగ్‌మాత్రం తనవాగ్దాన ప్రకారం బోర్డర్ రిజియన్ను గుర్తించక దుమ్మెత్తిపోస్తూంది. కొమింటాంగ్, దాని నాయకుడు చియాంగ్ అర్థంచేసుకోవాల్సిన విషయమేమంటే, మాకు షెన్సీ-కన్సూ-నింగ్‌షా బోర్డర్ రిజియన్‌ను ప్రత్యేక భాగంగా అట్టిపెట్టాలని కోరికలేదు. కొమింటాంగ్ ఆప్రదేశాన్ని గుర్తించినపక్షంలో అలావుంచడం మాకిష్టం లేదు. మరి నేడు ఆ భాగమలా యెందుకున్నదంటే గత్యంతర్యంలేక అలా వుంచవలసివస్తోంది. మీ వాగ్దానాన్ని భగ్నంచేశారు. మీరు ఆ బోర్డర్ రిజియన్ను గుర్తించలేదు. మీరుచెప్పినట్లు ప్రజా ప్రభుత్వ రాజ

కీయ పాలసీని అంగీకరించుటలేదు. పైపెచ్చు మమ్మలను మా ప్రజా తంత్రి విధానాన్ని దూషింపసాగారు.

మేము ప్రతిసారి ఆ ప్రదేశాన్ని గుర్తించి జాతీయ ప్రభుత్వం క్రిందికి తీసికొమ్మంటే, మీరలాతీసికోక అట్లాగే ఉంచారు. దానికి బాధ్యు లెవరు ? కారణమేమిటి ? మీరు ఎల్లప్పుడు నిరాకరిస్తారు; అలాగే విడిగ ఉంచుతున్నారు. చైనా జాతీయప్రభుత్వ బాధ్యుడై, కొమింటాంగ్‌ను నడిపే నాయకుడు చియాంగ్‌లాంటి గొప్పవాడు నిష్కారణంగా తన 'చైనా భవిష్యత్' అనే పుస్తకంలో ఈ విభజనకు కారకులు కమ్యూనిస్టు లని మాపై దుమ్మెత్తిపోశాడు. అందుకు కారణమేమిటి ? మా వాగ్దానాలు పూర్తిచేయమని చియాంగ్ కోరుతున్నట్లే ఆయన వాగ్దానాలను పూర్తి చేయమని మేము కోరుతున్నాం ఏనాడో సోవియట్‌పద్ధతిని రద్దుచేసి ప్రజా ప్రభుత్వాన్ని నెలకొల్పిన బోర్డర్ ప్రదేశాన్ని గుర్తించాలి. తదితర జపాను వ్యతిరేక కేంద్రాలను గుర్తించి జాతీయైక్యతకు పూనుకోవాలి. అతడు గుర్తించక తిరస్కరించడంవల్లనే మేము విధిలేక వేరుగ ఉంచవలసి వస్తోంది. కాన ఈ విభజనకు చియాంగే బాధ్యుడుగాని మేముగాదు.

నాల్గవవాగ్దానం రెడ్ ఆర్మీని గూర్చి. పేర్లు, హోదాలు మార్చాం. జాతీయవిప్లవ సైన్యంగా పునర్నిర్మాణంచేసి జాతీయప్రభుత్వపు మిలటరీ కౌన్సిలు అదుపుఆజ్ఞల్లో పోరాడుతున్నాం. వాగ్దానం ఎన్నడో పూర్తిగా చెల్లించివేశాం. కొత్త నాల్గవసైన్యం మాత్రం ప్రస్తుతం కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన నడుపబడుతోంది. అందుకు 1941 జనవరి 17 వ తేదీన జాతీయ ప్రభుత్వ మిలిటరీకౌన్సిలు దాన్ని రద్దుచేయడమే కారణం. ఇది విప్లవ వ్యతిరేక అభివృద్ధినిరోధకచర్య. జాతీయ ప్రతిఘటనాశక్తిని బలహీనపరు స్తోంది. అంతటితో కొత్త నాల్గవసైన్యంపై తన అధికారాన్ని కోల్పో యింది. ఆసైన్యంపై కొమింటాంగ్ ప్రతిరోజూ దాడిచేస్తూనే ఉంది. అయినా వారు జపానువ్యతిరేక ప్రతిఘటన సాగిస్తూనే వున్నారు. వారు సహితం మొదటి మూడు షరతులు పూర్తిచేశారు. నాల్గవషరతు పూర్తి చేయడానికి చియాంగ్‌వైపు ఎదురుచూస్తున్నారు. అతడు వారిని గుర్తిస్తే వారు తిరిగి జాతీయప్రభుత్వంచే పాలింపబడటానికి సంసిద్ధులుగ ఉన్నారు.

## కొమింటాంగ్ చేసిన వాగ్దానాల మాటేమిటి ?

పై సంఘటనలకుతోడు 11వ విస్తృతసమావేశంలో కమ్యూనిస్టు సమస్యకు మరికొన్ని పాయింట్లు జతపర్చింది. "మిగతా విషయాలు యుద్ధానంతరం ఒక సంవత్సరంతర్వాత పిలువబడే జాతీయ ఎస్సెంబ్లీలో చర్చించవచ్చు." ఏమిటా మిగతా విషయాలు ?

అవి కొమింటాంగ్ నియంతృత్వాన్ని రద్దుచేయడానికి సంబంధించిన విషయాలయి ఉంటాయా ? లేక ఫాసిస్టు రహస్యపోలీసుశాఖను రద్దు చేయడమా ? ప్రజలను పీడించుకొని తినే పన్నులపాలసీ మార్చడాన్ని గురించా ? కార్మిక కర్షక ప్రజాజీవితాన్ని అభివృద్ధిపర్చడమా ? దేశవ్యాపిత ప్రజాస్వామ్యస్థాపనా ?

1937 సెప్టెంబరు 22న మేము చేసిన ప్రకటనలో ఈ విధంగా ఉంది "చైనాలో ప్రజాప్రభుత్వం స్థాపించాలని, జాతీయ ఎస్సెంబ్లీ పిలవాలని, ఒక రాజ్యాంగనిర్మాణాన్ని తయారుచేయాలని, చైనాప్రజల సుఖజీవనానికి మార్గాలు చూపాలని మనంతలపెట్టితే ప్రప్రథమంగా, దేశంలో వ్యాపించి ఉన్నకరువుకు, తదితర ప్రకృతికి సంబంధించిన విషాదసంఘటనలకు గురయిన ప్రజలకు సహాయం చేయాలి. కూడు, గుడ్డ కల్పించాలి. జాతీయరక్షణ కవసరమైన ఆర్థికసౌష్టాన్ని కల్గించాలి. ప్రజలను కష్టాల్నుండి కాపాడి వారి జీవితవిధానాన్ని పెంపుదల చేయాలి."

1937 సెప్టెంబరు 23వ తేదీన చియాంగ్ చేసిన ప్రకటనలో మా మొత్తం ప్రణాళికను అంగీకరించాడు. అతడు కమ్యూనిస్టులను వారి నాల్గుషరతులను పూర్తిచేయమని ఎలుగెత్తి కోరేటప్పుడు, ఆయనప్రభుత్వం, ఆయన, కొమింటాంగ్ చేసిన వాగ్దానాలను ఎంతవరకు అమలుపర్చాడో చూడవద్దా ? నేడు చియాంగ్ జాతీయప్రభుత్వ నాయకుడు. కొమింటాంగ్ డైరెక్టరు. కమ్యూనిస్టులకు, ప్రజలకు అతడు చేసిన వాగ్దానం ప్రకారం ప్రజా ప్రభుత్వాన్ని అమలుపర్చాడా ? ప్రజల జీవితప్రమాణాన్ని అభివృద్ధి చేశాడా ? లేదు.

ఆయన మాటలను ఆయనే త్రోసిపుచ్చుతాడనీ, చెప్పేదొకటి చేసేదొకటి సాగిస్తాడు అని, నిరంకుశంగా వత్తిడిచేస్తాడని మేము తలంపము. కమ్యూనిస్టులమైన మేము, ప్రజలు వాంఛించేవి పట్టిమాటలు కాదు. కార్య

క్రమం. ఏవైనా మంచిపనులయితే మేమాహ్వానిస్తాం. కాక, వట్టి బూటకా లయితే ప్రజలు ఎక్కువకాలం మోసపోరు.

## మేము ఐక్యతకు విజ్ఞప్తి చేస్తున్నాం

టూకీగా చియాంగ్‌కు తెలిపే మా కోరికలు :—

— తుదివరకు ప్రతిఘటనచేస్తూ, లొంగిపోయే క్లిష్టదశను అరికట్టాలి.

— సహకారాన్ని సాగిస్తూ, అంతర్యుద్ధాన్ని ఆపివేయాలి.

— బోర్డర్ రిజియన్, శత్రుశ్రేణుల వెనుకభాగంలోని జపాను వ్యతిరేక కేంద్రాల్లోను ప్రజాప్రభుత్వ పద్ధతుల్ని గుర్తించాలి.

— కొత్త నాల్గవసైన్యాన్ని మరల గుర్తించాలి. కమ్యూనిస్టు వ్యతిరేక ఉద్యమం కట్టిపెట్టాలి. బోర్డర్ రిజియన్ చుట్టూపెట్టిన ఐదు లక్షల సైన్యాన్ని ఉపసంహరించుకోవాలి.

— ప్రజా రాజకీయసభ (Peoples Political Council) ను కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారానికి కీలుబొమ్మగా ఉపయోగించుట మానాలి.

— యుద్ధం ముగియకముందే జాతీయ మహాసభను పిలవాలి.

— ప్రజలకు వాక్సభా, పత్రికా స్వాతంత్ర్యా లివ్వాలి.

— ఏకపార్టీ నియంతృత్వాన్ని రద్దుచేయాలి.

— పన్నుల, వడ్డీల రేట్లు తగ్గించాలి. కార్మికుల జీవితభృతిని పెంచాలి. చిన్నపరిశ్రమలకు రక్షణలిచ్చి అభివృద్ధిచేయాలి.

— రహస్య పోలీసుశాఖను రద్దుచేసి, ప్రజలకు ఆ శిక్షణ నీయడం మానాలి.

— ప్రజాతంత్ర విద్యావిధానం ఆచరణలో పెట్టాలి.

ఇందులో చాలా భాగము, మాకు, ప్రజలకు- చియాంగ్, కొమింటాంగ్‌లు చేసిన వాగ్దానాలే ఉన్నాయి. అతడి వాగ్దానాలు చెల్లించ పూనుకొంటే మా వాగ్దానాలు పూర్తిగ ఆచరణలో పెడతామని ప్రతిజ్ఞ చేస్తున్నాం. ఉభయులకు మధ్య రాయబారాలకు సర్వవేళల సంసిద్ధంగా ఉన్నాం. కొమింటాంగ్, చియాంగ్‌లు సహకారం కోరి ముందుకువస్తే తలవొగ్గి ఆహ్వానిస్తాం.

చియాంగ్, కొమింటాంగులు తమపాలసీలతో దేశాన్ని మహావిపత్తు లోకి నెడుతున్నారు. అన్ని జపాను వ్యతిరేకపార్టీలు, ప్రజలు, దీన్ని ఎదు ర్కొని అరికట్టాలి.

ప్రపంచంలో కని విని ఎరుగని గొప్ప మార్పులు వస్తున్నాయి. చియాంగ్, కొమింటాంగ్, తదితర దేశభక్తులు దీన్ని గుర్తించి, తదను గుణ్యంగా ప్రవర్తిస్తారని మేము ఆశిస్తున్నాం.



## యుద్ధం-కార్మికవర్గమనే రష్యన్ట్రేడ్‌యూనియన్ పత్రికలో

# వ్లాడిమర్ రోగోవ్ ప్రకటించిన వ్యాసం

(1943 ఆగస్టులో)

గడచిన ఆరేండ్లయుద్ధంలోనూ, కొంత భూభాగాన్ని కోల్పోయినా, చైనా ప్రభుత్వం తనసైన్యాలను ఓడిపోకుండా కాపాడుకుంది. అనేక చిక్కులకు గురయినప్పటికి, చైనా సైన్యం తీవ్రప్రతిఘటనా సామర్థ్యాన్ని చాటింది.

త్వరలో చైనాను జయించాలనుకొన్న జపాను మిలటరీప్లాను భగ్న మయింది. చైనాప్రజల ప్రతిఘటనను భగ్నంచేయడం వారిచేతగాలేదు. చైనాతో యుద్ధం బహుదీర్ఘమై జపానుకు రోజురోజుకు సమస్యలు క్లిష్టతర మయ్యాయి కాచుకొనే యుద్ధాలు సాగిస్తూ, విశాలమైన యుద్ధరంగంలో చైనాసైన్యాలు తమ సమీకరణకు, పునర్నిర్మాణానికి కావలసిన కాలాన్ని గడించాయి. పోరాటశక్తి వృద్ధిపొందింది.

1938 లో వూహాన్ పడిపోగానే తన సైన్యాలనన్నిటిని పున ర్నిర్మాణం చేయడానికి చియాంగ్ ఒకప్లాను తయారు చేశాడు. ఆ ప్లాను లోని ముఖ్యసూత్రాలేమంటే,—

— మొదటిది – చైనాదేశమొక దీర్ఘకాల రక్షణయుద్ధ పాలసీని ఆచరించాలి.

— రెండవది – ఈ పరిస్థితుల్లో గెరిల్లా పోరాటం అవసరం. కాబట్టి గెరిల్లా ఉద్యమాన్ని అభివృద్ధి చేయాలి.

— మూడవది — శత్రువుపై తిరుగుదాడులుచేసి చైనానుండి పార ద్రోలడానికి, నవీనయుద్ధయంత్రాల నుపయోగించ సమర్థులయిన కొత్తసైన్యాన్ని, కొన్నిలక్షలు సమీకరించాలి.

ఇప్పటికి మూడేళ్ళయింది. సైన్యంలో సంస్కరణలుగాని, కొత్త సైన్యాన్ని తయారుచేయడంగాని, శిక్షణ పెంపొందించుటగాని ఇంతవరకు పూర్తిగ జరుగలేదు

జాతీయ చైనా యుద్ధనిర్వహణకు, చైనాలో కావలసినన్ని అవకాశా లున్నాయి. పెద్దసైన్యాన్ని నిర్మించి పోషించవీలున్నది. దీర్ఘయుద్ధం కొనసాగించుట కవసరమైన ముడిసరుకులు చైనాలో పుష్కలంగా దొరుకు తాయి. పెద్దఎత్తున యుద్ధపరిశ్రమలు నిర్మించుటకింకా ప్రారంభించనేలేదు.

హద్దూపద్దులేని విపరీతలాభాల కాశించే వర్తకులు కొందరు, ప్రజ లంతా యుద్ధంతో విసిగిపోయి ఉన్నారనీ, వారిని తృప్తిపర్చడానికి అవసర మైన ఉపయోగవస్తువులను ఉత్పత్తిచేయాలనీ, ఒకవాదన తెస్తున్నారు. ఇందువల్ల సైన్యంయొక్క పోరాటశక్తి తగ్గిపోతుంది. హెచ్చుభాగం యుద్ధపరికరాల సప్లయికంతకు పరదేశాలపై ఆధారపడవలసి వస్తోంది. ఇంగ్లండు, అమెరికాలపై జపాను యుద్ధం ప్రారంభించిన తర్వాత, చైనాకు ఆయుధాల సరఫరా కష్టతరమైపోయింది.

చైనా సైన్యాలకు మనుష్య సంపద కొరతలేదు కాని తగిన ఆయుధసామగ్రి సప్లయిలేదు. అవసరమైనంత శిక్షణపొందిన నిలవసైన్యం లేదు. ప్రజలను ఒక ప్లానుప్రకారం మిలటరీకోకి చేర్చుకోవడం లేదు. దేశవ్యాపిత సైనికరిక్రూట్‌మెంటు ఆచరణలోకి రాలేదు. నిర్మాణం, శిక్షణ సంతృప్తికరంగా లేవు. చైనాసైన్యాలకు తగిన కమాండర్లు లేకపోవడమే ముఖ్య బలహీనత. వివిధరంగాలలోని యుద్ధచర్యలను సమన్వయించు కొనడం సరిగ నిర్వహించడంలేదు.

1941 డిశంబరునుండి జపాను పసిఫిక్‌యుద్ధంపై కేంద్రీకరించింది. చైనాతో యుద్ధం అడుగుపడ్డది. దీనితో కొందరు చైనా మిలటరీ పెత్తన దార్లు, రాజకీయవేత్తలలో 'ఇకభయ్యాలేదు' అనే ధోరణి ఏర్పడ్డది. దీన్ని ఊతగా గొని జపాను 'సంధిరాయబారాలు' సాగించడం ప్రారంభించింది.

జపానువాళ్లు చైనాలో అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టడానికి విశ్వప్రయ త్నాలు చేస్తున్నారు. చైనా ప్రతిఘటనాశక్తి నట్లా కుంటుపరచి, తమరు

బలపడాలని చూస్తున్నారు. ఈ ప్రయత్నానికి చైనాలోని లొంగుబాటు గాళ్ళను ఉపయోగించుకుంటున్నారు. లొంగుబాటుగాళ్లు, చైనా కమ్యూనిస్టుపార్టీ - కొమింటాంగ్‌ల మధ్యనున్న మిలటరీ ఐక్యతను ధ్వంసంచేసి, కొత్త నాల్గవ, ఎనిమిదవసైన్యాలపై దాడికి కొమింటాంగును పురికొల్పుతున్నారు. ఈ సైన్యాలు జపాను వ్యతిరేకయుద్ధంలో అపారఖ్యాతిని గడించి చరిత్రలో ప్రసిద్ధికెక్కాయి.

చైనాప్రభుత్వం మోసగాంండ్రను బహిష్కరించి జాతీయైక్యతను, పరిస్థితిఘటనాశక్తిని కాపాడుటకు ఏమీ గట్టిచర్యలు తీసికోలేదు. జరిగిందేమంటే, కొత్తనాల్గవ, అష్టమసైన్యాలున్న ప్రాంతానికే చైనా అధికారులు అదనపుసైనికదళాలను పంపి కేంద్రీకరిస్తున్నారు.

గత కొన్నిసంవత్సరాలపాటు, నేను 15 రాష్ట్రాలకు పైగా తిరిగి చూచాను. యుద్ధరంగంలోను, వెనుకభాగంలో గూడ, చైనాలోని భిన్నాభిప్రాయాలు గలవారు లొంగుబాటుగాళ్ల మోసపుచర్యలు చూచి ఆందోళన పడుతున్నారు. కాని వారందరు, అంతర్యుద్ధాన్ని పురికొల్పే ప్రయత్నాలు భగ్నమయినాయని విశ్వసిస్తున్నారు.

చైనాశక్తులు గడచిన యుద్ధాలలో ఆరితేరాయి. బలాన్ని సంపాదించాయి. చైనా ప్రజాస్వాతంత్ర్యాన్ని ఓడిపోనీయవు.

అవసరమైన ముఖ్యముడిసరుకులు, బోలెడంత జనశక్తిగల చైనాకు శత్రువు నోడించి విజయాన్ని సాధించే మహదవకాశాలున్నాయి.

విజయం చేకూరాలంటే దేశఆర్థికవిధానమంతా యుద్ధపునాదులపై ఏర్పాటుచేయాలి. అన్నిటికంటె ముందుగ యుద్ధరంగానికి సరుకులు సరఫరాచేయాలి. ఈ పనులను నిర్వహించుటకు అభేద్యమైన జాతీయైక్యత కావాలి. ఐక్యతే జాతిస్వాతంత్ర్యానికి దారితీస్తుంది.

అంతర్యుద్ధసంక్షోభం వలన వాటిల్లే ప్రమాదాన్ని, చియాంగ్, అతని అనుచరులు ఎంత శీఘ్రంగా అర్థంచేసుకొంటే, విజయం అంత సులభ సాధ్యమవుతుంది. అట్లుగాక కొత్తనాల్గవ, ఎనిమిదవసైన్యాలపై ఇప్పటి మాదిరిగనే దాడి చేస్తుంటే అంతర్యుద్ధం తప్పక వస్తుంది. చైనాప్రభుత్వంలో విచ్ఛిన్నకులకు పైచేయివచ్చి అంతర్యుద్ధమే ప్రారంభమయితే, చైనాస్వాతంత్ర్యపోరాటం దుస్థితిపాలవుతుంది.

# తప్పక చదువవలసిన పుస్తకాలు

1. లెనిన్ పల్లెటూరి పేదలకు
2. మన లెనిన్
3. స్వాతంత్ర్య సంగ్రామం (స్టాలిన్)
4. ఆర్. ఎస్ ఎస్. నిజస్వరూపం
5. జపాను నిజస్వరూపం
6. సామ్రాజ్యవాదం
7. ప్రజానాయకుడు స్టాలిన్
8. స్టాలిన్ - జాతులసమస్య
9. గుండెనిబ్బరం (రష్యా యుద్ధకథలు)
10. రెడార్మీ
11. కార్మికవర్గం - దేశరక్షణ
12. పృధ్వీసింగు చరిత్ర
13. నేటి సోవియట్ యూనియన్
14. వీరమాత
15. వీరేశలింగం ప్రహసనాలు
16. స్టాలిన్ - నిర్మాణసమస్యలు
17. 8 వ అఖిలభారత రైతుమహాసభ
18. పశ్చాత్తాపము (నాటిక)
19. చైనా యెర్రసైన్యం
20. సోవియట్ స్త్రీలు
21. శిశుహంతకులు
22. సోవియట్ విదేశాంగనీతి - భారతదేశం
23. నీవూ - నీపుట్టుక
24. నీవూ - నీపరిణామము
25. రెండాకులు ఒక మొగ్గ

---

ప్రజాశక్తి కార్యాలయం, బెజవాడ

ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ.



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్ |
| | పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B178 |
| పుస్తకం పేరు | చైనా [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | No |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BCL |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |